*Issued on 29—11—1958*




**Volume XVII**
**No. 5**

**18th August, 1958**
**(Monday)**

# Andhra Pradesh Legislative Assembly Debates

**Part II — Proceedings other than Questions and Answers**

## OFFICIAL REPORT

CONTENTS

| CONTENTS | Page No. |
|---|---|
| Adjournment motions re: | |
| Strike Notice by Workers of various Trade Unions | 314—312 |
| Speech alleged to have been made by the Chief Minister at Koilkuntla — Not admitted ... | 315—322 |
| Announcements re: | |
| Constitution of the Committee on Subordinate Legislation ... | 322 |
| Constitution of the Committee of Privileges . | 322—323 |
| Papers laid on the Table of the House: | |
| Rules issued under Section 16 of the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) Act, 1952 ... | 323—324 |
| Amendments to the Andhra Pradesh General Sales Tax Rules, 1957 ... | 324 |
| Leave of absence to Srimathi Kusum Gajapathi Raju ... | 324 |
| Presentation of the Report of the Select Committee on the Madras Land Encroachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 . | 324—325 |
| Government Bill: | |
| The Andhra Pradesh Ceiling on Agricultural Holdings Bill, 1958 —Discussion not concluded | 325—386 |

NOTE: * at the commencement of the speech denotes confirmation from the Member not received in time.

PRINTED BY THE OSMANIA PRINTING WORKS, SECUNDERABAD FOR THE DIRECTOR, GOVT. PRINTING PRESS, HYDERABAD-A.P

THE

ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[Part II — Proceedings other than Questions and Answers]

# OFFICIAL REPORT

Fifth Day of the Seventh Session of the Andhra
Andhra Pradesh Legislative Assembly

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

Monday, the 18th August, 1958

The House met at Half Past Eight of the Clock.

(MR. SPEAKER IN THE CHAIR)

### QUESTIONS AND ANSWERS

(See Part I)

### *ADJOURNMENT MOTION RE. STRIKE NOTICE BY WORKERS OF VARIOUS TRADE UNIONS*

[illegible] స్పీకర్:—శ్రీ బి. శ్రీరామమూర్తిగారు ఈ క్రింది adjournment motion యిచ్చారు:—

"I intend to call upon the attention of the hon. Minister for Labour on a specific matter of urgent public importance namely,

"the situation arising out of the issue of strike notices from 25th of August 1958 by about 30,000 workers belonging to various trade unions in the State, consequent on the failure of the Government to accept completely the recommendations of Hanumantha Rao Committee".

దీనికి మంత్రిగారి వద్ద information ready గా ఉన్నదా?

ఆర్థికమంత్రి (శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి):—లేదండి. ఈ విషయములో యింకను conciliation proceedings జరుగుతూ వున్నవి. అవి జరిగిన తరువాత Labour Commissioner గారి ద్వారా వారియొక్క remarks తో

సహా ప్రభుత్వానికి రిపోర్టు రావలసి వున్నది. అవి అన్నీ వచ్చిన తరువాత దానిని గురించి ఒక clear picture తెలుస్తుంది. కాబట్టి దీనిని 22వ తేదికి వాయిదా వేయమని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్:—సరే. ఈ question అంతా 22వ తేదీకి వాయిదా వేశాను.

## SPEECH ALLEGED TO HAVE BEEN MADE BY THE CHIEF MINISTER AT KOILKUNTLA,

మిస్టర్ స్పీకర్:—శ్రీ బి శ్రీరామమూర్తిగారు యింకొక motion ను యీ క్రింది విధముగ యిచ్చారు.

"I intend to move the following adjournment motion: "That the House be adjourned to discuss a specific matter of urgent public importance namely, the serious situation and threat to democracy arising out of the speech delivered by the hon. Chief Minister at Koilkuntla on the 1st of August 1958 (as published in Visalandhra dated 8-8-58 — vide page No. 7) which in spirit denies the facility of development activities etc. to the areas which returned to the legislature candidates other than those belonging to the ruling party as indicated by the sentence "Will the cow give milk if fodder is given to donkey?" (vide page No 4 of Andhra Patrika dated 5-8-58)."

ఈ motion యిచ్చేటప్పుడు శ్రీరామమూర్తిగారు ఒక మంచి పని చేశారు అందుకు నాకు చాలా సంతోషముగా ఉన్నది. వారు యీ విషయమును గురించి పత్రికలలో వేసినవి మూడు News Paper Cuttings తీసుకొని వచ్చి నాకు యిచ్చారు. నిజముగా యీవిధముగ చేయడము ఎంతో మంచిపని. కాబట్టి సభ్యులందరు కూడ యిదే విధముగ చేయాలని అంటున్నాను. ఈ విధముగ చేస్తే, యిలాంటి adjournment motions గురించి తీర్మానము చేయటానికి ఎంతో సులభముగా ఉంటుంది. ఈ విధముగ చేయకుండా ఏదో ఒక adjournment motion యిచ్చి, యిక్కడ చర్చచేస్తే, అది అసలు irrelevant కావచ్చు అంటున్నాను— Adjournment motions యిచ్చి, పత్రికలలో ప్రచురించిన Paper Cuttings ఏవీ కూడ తీసుకొనిరాకుండా, యిక్కడ abrupt గాను, అడ్డదిడ్డముగాను చెప్పడము, దాని మీద కొంత గందరగోళము జరగడము, తరువాత అది చాలావరకు పోవడము జరుగుతూ ఉంటుంది. It is not an argument before a Criminal Court. This matter is before the highest tribunal.

మీ అందరి dignity కొరకు, యిప్పుడు శ్రీరామమూర్తిగారు చేసినట్లుగా Paper Cuttings తో సహా తీసుకొని వచ్చి యిక్కడ దానిని గురించి చెబితే బాగా ఉంటుంది.

ఇప్పుడు శ్రీరామమూర్తిగారు యిచ్చిన యీ adjournment motion గురించి నేను ఒక్క విషయము చెబుతున్నాను. అప్పుడు ఏదో Chief Minister గారు మాట్లాడిన తరువాత emotional speeches యివ్వడము అంతా జరిగిపోయింది కాబట్టి యిప్పుడు దానిని గురించిన urgency గాని, అవసరము గాని ఏమీలేదు. ఈ విషయాన్ని గురించిన discussion అంతా అయిపోయింది గనుక, యిప్పుడు యీ adjournment motion ను నేను allow చేయడము లేదు.

But I want to give one ruling with regard to motions of this type ఎవరైనాసరే ఒక మెంబరుయొక్క conduct ను గురించి attack చేసినప్పుడు రెండు విధములుగ వస్తూ ఉంటాయి ఇప్పుడు యీ Assembly లోనే ఒక సభ్యుడు misbehave చేశారనుకోండి. అది మంత్రి కావచ్చు, ఏ గౌరవ సభ్యుడైనా కావచ్చు. ఎవరైనాసరే. అట్లా జరిగినప్పుడు, వెంటనే ఆ మెంబరు వచ్చి నా attention draw చేయవలసి ఉంటుంది. "ఇదిగో, యిది స్టేటుమెంటు, ఈ విధముగ statement యిక్కడ యిచ్చారు." అని నా నోటీసుకు వెంటనే తెస్తే, అప్పుడు వెంటనే నేను దానిపై చర్య తీసుకుంటాను. అప్పుడు వారిని పిలిచి, అది పొరబాటో, తప్పు అవునో కాదో కనుక్కోటానికి వీలు అవుతుంది. అది ఎప్పుడో కాదు. వెంటనే, They must draw my attention specifically to that portion of the statement అది యిక్కడ అసెంబ్లీలో జరగనివ్వండి. బయట ఎక్కడైనా జరగనివ్వండి. ఎక్కడ జరిగినను, అది papers లో పడినను, అది ఏమిటో, ఎక్కడ పడిందో, దానికి evidence ఏమిటో, అవి అంతా evidence తో సహా నాకు తెచ్చి సందర్భాలు అన్నీ explain చేస్తూ, యిదిగో యిది జరిగింది. చూడండి, ఈ విధముగ అన్యాయము జరిగింది అని చెబితే, అప్పుడు నేను తప్పకుండా చర్య తీసుకోటానికి వీలు అవుతుంది. ఆ విధముగ కాకుండా vituperations తో ఏదో చేశారు అని చెప్పడము సరైన పద్ధతి కాదు. కాబట్టి ఏ మెంబరు conduct ను గురించి అయినా Assembly లో గాని, బయట గాని, attack చేస్తూ మాట్లాడితే, దానిని గురించి ముందుగా నా attention draw చేస్తూ ఫలానా విషయము జరిగిందని చెప్పి, దానికి adjournment motion పెట్టటానికి నా permission తీసుకొని, దానిమీద యిక్కడ discuss చేయవలసి ఉంటుంది. అంతేకాని, నా permission లేకుండా ఎవ్వరూ కూడా ముందుగా నాతో

చెప్పకుండా యిక్కడ adjournment motion ప్రతిపాదించి చర్చించ కూడదు అని నేను ruling యిస్తున్నాను. ఇది యిలాంటి motions విషయంలో నా final ruling అని చెబుతున్నాను—దీనిని యిక మార్చేది ఏమీ లేదు. కాబట్టి సభ్యులందరూ గుర్తించవలసిందిగా కోరుతున్నాను. ఈ విధముగ చేస్తే మంచిదని యీ House యొక్క గౌరవము కొరకు, సభ్యులందరి గౌరవము కొరకు, నా గౌరవము కొరకు మీకందరికి చెబుతున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం):—అధ్యక్షా, సరే మీరు రూలింగు యిచ్చారు. బాగానే ఉన్నది. కాని ఒక్క వాక్యము మాత్రము చెప్పదలచుకున్నాను.

మిస్టర్ స్పీకర్:—Ruling యివ్వడము అంతా జరిగిపోయింది. ఇక దేనిని గురించి కూడ మాట్లాడనివ్వను. No more discussion about it.

*Sri B Sree Ramamurthi* —On a point of Order, Sir.

మిస్టర్ స్పీకర్:—అదేమీ లేదు.

శ్రీ బి. శ్రీరామమూర్తి:—అది కాదండి. Point of Order ఉన్నది.

*Mr Speaker* —No, no. Ple se sit down.

శ్రీ బి. రామమూర్తి:—ఒక్క వాక్యమేనండి. Point of Order వినండి.

మిస్టర్ స్పీకర్:—నేను రూలింగు యిచ్చిన తరువాత, యిక దాని మీద point of Order అనేది ఉండదు.

శ్రీ బి. శ్రీరామమూర్తి:—మీ రూలింగు మీద point of Order కాదండి అసలు issue మీదనే Point of Order raise చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:—ఒకసారి ఒక motion మీద రూలింగు యిచ్చిన తరువాత యిక point of order అనేది ఉండదు. అంతా అయిపోయింది. కూర్చోండి.

శ్రీ బి. శ్రీరామమూర్తి:—మీ రూలింగు మీద కాదండి. ఈ issue మీదనేనండి.

*Mr. Speaker*:—No, please sit down. I order you to sit down.

శ్రీ బి. శ్రీరామమూర్తి:—మీరు కూర్చోమంటున్నారు కనుక కూర్చుంటున్నాను.

*Mr. Speaker*:— Thank you.

శ్రీ బి. శ్రీరామమూర్తి:—ఒక్క వాక్యము చెబుతానండి. Point of order అని అడిగితే మీరు వినకపోతే ఎట్లా?

మిస్టర్ స్పీకర్:—మీ Point of order ఏ రూలు క్రింద? ఏ constitution ను తప్పు చేశామని?

శ్రీ బి. శ్రీరామమూర్తి:—అదే చెబుతున్నాను. The speech delivered by the hon. Chief Minister (Interruption).

మిస్టర్ స్పీకర్:—ఏ రూలు క్రింద? అని అడుగుతున్నాను. చెప్పండి. ముందు రూలు, Constitution చెప్పి, ఆ తరువాత మాట్లాడండి—

శ్రీ బి. శ్రీరామమూర్తి:—ఆ speech లో ఉన్న contents, శాసన సభలో ఉన్న సభ్యుల హక్కులు ఏరకముగా భంగపడినవో మీకు మనవి చేయదలచుకొని మాట్లాడుతున్నాను.

మిస్టర్ స్పీకర్:—అది సరే. దానిని ఏ రూలు క్రింద చెబుతున్నారు?

శ్రీ పి. నరసింహప్పారావు (పాలకొండ-జనరల్):—అధ్యక్షులవారు ఒక motion ను గురించి రూలింగు యిచ్చిన తరువాత, మరల దానిమీదనే point of order ను లేవదీసి దానిని గురించి మాట్లాడవచ్చునా?

మిస్టర్ స్పీకర్:—అదే. అట్లాచేయటం చాలా తప్పు అని చెబితే, వినకుండా ఉన్నారు.

శ్రీ పి. నరసింహప్పారావు:—శ్రీరామమూర్తి చెప్పినదానికి నేను point of order raise చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:—నేను శ్రీ నరసింహప్పారావుగారి point of orderను up-hold చేస్తూ, వారి point తో agree అవుతున్నాను. అనగా ఒక Adjournment motion మీద రూలింగు యిచ్చిన తరువాత మరల దానిమీద discussion

గాని, information అడగడము కాని ఉండకూడదు. దానిమీద నరసింహప్పా రావుగారు raise చేసిన point of order ను నేను uphold చేస్తున్నాను. దీనిని గౌరవ సభ్యులందరు గమనించాలని కోరుతున్నాను.

శ్రీ కె. ఎల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్):—On a point of submission, Sir. ఒక గౌరవ సభ్యుడు point of order raise చేసి నప్పుడు ఏ రూలుక్రింద అని అడగడము, ఇంకొక గౌ॥ సభ్యుడు లేచి point of order అని అంటే, దానికి రూలు అడగకుండానే, వినకుండానే, దానిని accept చేయడము, అంటే, యిది ఎంతవరకు న్యాయమని అడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్:— అందులో point of order ఉన్నది. ఇందులో లేదు.

శ్రీ కె. ఎల్. నరసింహారావు:— శ్రీరామమూర్తిగారు point of order అంటే, అది ఏ రూలు క్రింద అన్నారు. శ్రీ నరసింహప్పారావుగారు point of order అని అంటే అసలు అది ఏమిటో మీరు వినడే లేదుగదా?

*Mr. Speaker*:—Mr. Narasimha Rao! will you please sit down. I have heard it. If you do not know I cannot help it. మీరు వినక పోతే నేనేమి చేసేది? నేను ఏ రూలు అని అడిగాను. శ్రీరామమూర్తిగారు చెప్పలేక పోయినారు. అంతే. అంతటితో ఊరుకోండి. Please don't interfere too much. నరసింహప్పారావుగారు raise చేసిన point of order సరిగాఉంది. అందువల్ల accept చేశాను. అట్లాగాక ఒకసారి ఒక adjournment motion మీద రూలింగు యిచ్చిన తరువాత, దానిమీద మరల point of order లేవ దీయడం. దానికి explanation చెప్పడం, యింకా ఏదో చెప్పడం, సరీగా చెప్పలేక పోవడం, ఇది అంతా తప్పు అని అంటున్నాను.

శ్రీ జి. ఎలమందారెడ్డి (కనిగిరి):—అధ్యక్షా, మీరు యిప్పుడు రూలింగు యిచ్చారు. అది సభ్యులకు సంబంధించి నంతమటుకు మీ వద్ద నుంచి permission తీసుకోవాలని అన్నారు. ఒక గౌరవ సభ్యుని గురించి ఎవరైనా offending speech యివ్వడము జరిగితే, అది ఈ house లోని సభ్యులకు సంబంధించి నట్లుగానే ఉంటుంది. అలాంటప్పుడు privilege motion కు సంబంధించిన రూలు ప్రకారమే గదా అది ఆచరణలో పెట్టడము. అందుకు మీ యొక్క అనుమతి పొందాలని చెప్పడము, ఇది ఏ విధముగ reconcile కాగలదో నాకు అర్థము కాలేదు. దీనిని గురించి చెప్పాలని అధ్యక్షుల వారిని కోరుతున్నాను.

మిస్టరు స్పీకర్:—Privilege motions విషయములో నావద్దకు వచ్చి నాతో విషయము అంతా explain చేసి, నా అనుమతి పొందితేనే తప్ప లేకపోతే వీలు కాదు. రూలులో ఏమి ఉన్నదో చదవండి. Speaker యొక్క permission లేనిదే privilege motion ప్రవేశ పెట్టటానికి వీలులేదు. కాబట్టి ముందు నాతో చెప్పి, నా permission తీసుకుంటేనే, దాని సంగతి తేలుతుంది. నా పర్మిషను లేనిదే, వానిని గురించి సభలో speech యివ్వటానికి వీలు లేదు.

శ్రీ బి. రత్నసభాపతి (బద్వేల్):—అధ్యక్షా, గౌరవసభ్యులు ఉపన్యాసములు యిచ్చేముందు కూడ మీ పర్మిషన్ తీసుకోవలసి ఉంటుందా? ముఖ్యమంత్రిగారు బైటనో, ఇక్కడ ఎసెంబ్లీలోనో ఉపన్యాసము యిచ్చారనుకోండి. అది మెంబర్లకు offending గా కన్పించింది. అదేవిధిరి, సభ్యులుకూడ ఉపన్యాసము యివ్వవలచు కున్నప్పుడు నేను ఫలానా speech యిక్కడ ఎసెంబ్లీలోగాని, బైటగాని యివ్వబోతున్నాను, పర్మిషన్ యివ్వండి అని మిమ్ములను అడగవలెనా? అలాంటి వాటికి గూడ పర్మిషను అనేది ఉంటుందా?

మిస్టర్ స్పీకర్:— అది వేరు. ఒక సభ్యునియొక్క కొండక్టును attack చేయడము వేరు. ఊరకనే మంత్రులు ఏవో policies ను గురించి మాట్లాడే టప్పుడు యిట్లా, అట్లా అని చెబుతూ ఉంటారు. అలాంటి వాటికి పర్మిషను అవసరములేదు. అట్లాగాక అందులో ఏదైనా offending గా ఉన్నదని మెంబర్లకు తోస్తే, ఇట్లా ఫలానా విధముగ అక్రమాలు జరిగినవి, ఇది ఫలానావిధముగ offending గా ఉన్నది, ఇది సభ్యులయొక్క గౌరవమునకు, హక్కులకు భంగము కలిగించినది. Unparliamentary గాను, indecent గాను ఉన్నవని తెలిసి నప్పుడు, వాటినిగురించి యిక్కడ సభలో చర్చించబోయేముందు నాకు చెప్పి, నా పర్మిషను తీసుకోవాలి అంటున్నాను. ఎక్కడో సామాన్యంగా, ఉపన్యాసాలు యిచ్చేవాటికి నా పర్మిషను ఎందుకు? అవసరము లేదు. పర్మిషను అవసరమని ఎందుకు చెబుతున్నానని అంటే. అక్కడ ఏదో జరిగిందని, అది offending గా ఉన్నదని, abrupt గా యిక్కడ ఒక motion యిచ్చి, సభలో దానిని గురించి చర్చించడము, వారిని వీరు అనడం, వీరిని వారు అనడం యిదిఅంతా చేయడము నాకు యిష్టము లేదు.

శ్రీ బి. రత్నసభాపతి:—అధ్యక్షా, Privilege motions కు సంబంధించి నంతవరకు మీరు రూలింగు యిచ్చారు బాగానే ఉన్నది.

మిస్టర్ స్పీకర్:— Misconduct ను గురించి గాని, indecent గా మాట్లాడటము గాని, అది unparliamentary క్రిందకు వస్తుంది. ఇలాంటివి మూడు విధములుగా వుంటాయి. మొదటిది Unparliamentary అనేది. దీనికి question of privilege ఏమీ లేదు. Indecent గా మాట్లాడినప్పుడే, అది unparliamentary క్రిందికి వస్తుంది. తరువాత రెండవది privileges విషయం, అంటే మెంబర్ల హక్కులు భంగము అయినవి అని చెప్పేది, ఇకపోతే మూడవది. అక్కడ public లో పెద్ద గందరగోళముగ ఉన్నది, అది అంతా వెంటనే అణచవలెను. లేకపోతే పరిస్థితి అంతా చెడిపోతుంది అని చెప్పటానికి adjournment motions యివ్వడము ఉంటుంది. ఇందులో మొదట unparliamentary గాను, indecent గాను ఉన్నవాటికి యిక్కడ ఒక motion యిచ్చి, abrupt గా ఏదో చర్చించటానికి ప్రారంభించడము మంచిదికాదు. Therefore in the interests of the dignity of this House and the hon. Members, it is better such instances are brought to my notice before giving Privilege motions for discussion in the House. Mr. Ratnasabhapathi, it is better for you also.—

శ్రీ బి. రత్నసభాపతి:— అధ్యక్షా, ఇప్పుడు మీరు చెప్పింది నాకు బాగా clarify కాలేదండి. మీరు యిచ్చిన రూలింగులో మూడు విషయములు ఉంటాయని అన్నారు.

మిస్టర్ స్పీకరు:— ఇక అంతకంటే ఎక్కువగ నేను clarify చేయలేను. If you want further clarification, you can ask me privately in my chambers. I am going to the next item.

శ్రీ బి. శ్రీరామమూర్తి :— నేను చెప్పవలెనని అంటున్నది మొన్న discuss చేసిన విషయమును గురించి కానే కాదండి. దానిని గురించి నేను మరల ఎత్తుకోవడము లేదు. ఒక్క వాక్యము అయినా దానిని గురించి ఎత్తను. వేరే కొత్తవిషయమును గురించి మాట్లాడదలచుకున్నాను. వినండి.

మిస్టరు స్పీకరు:— క్రొత్తవిషయమేమీ యిప్పుడు అక్కరలేదు.

శ్రీ బి. శ్రీరామమూర్తి:— దానికి సంబంధించినదే ఇంకొక విషయము ఉన్నది.

మిస్టరు స్పీకరు:— దానికి సంబంధించినదైతే, అసలు చెల్లదు.

శ్రీ బి. శ్రీరామమూర్తి:— అది కాదండి. ఓటు చేసినది అన్న Point యిక్కడ ఉన్నది, గనుక నేను చెప్పబోయేది వినండి.

*Mr. Speaker*:— Now I go to the next item.

## *ANNOUNCEMENT RE: CONSTITUTION OF THE COMMITTEE ON SUBORDINATE LEGISLATION*

*Mr. Speaker*:- I have to announce to the House that the following candidates have been nominated for election to the Committee on Subordinate Legislation for a period of one year.

1. Sri E. Ayyapu Reddy
2. Sri G. Venkata Reddy Naidu (Minister for Law)
3. Sri P. V. Narsimha Rao
4. Sri E. Venkatram Narasiah
5. Sri Goka Ramalingam
6. Sri N. P. Changalraya Naidu
7. Sri A. B. Nageswara Rao
8. Sri Manda Bapiah
9. Sri D. V. Subba Rao
10. Sri Ch. Rajeswara Rao
11. Sri Gottumukkala Jagannatha Raju
12. Sri Kistamachary

As the number of candidates validly nominated is equal to the number of vacancies to be filled, viz., Twelve, I hereby declare them to have been duly elected to the Committee on Subordinate Legislation.

Under Rule 193 of the Andhra Pradesh Legislative Assembly Rules, I hereby nominate Sri E. Ayyapu Reddy to be the Chairman of the above Committee.

## *CONSTITUTION OF THE COMMITTEE OF PRIVILEGES*

*Mr. Speaker*: I have to announce to the House that the following candidates have been nominated for election to the Committee of Privileges for the financial year 1958-59:

1. Sri Divi Kondaiah Chowdary
2. Sri R. Lakshminarsimham Dora
3. Sri Shahabuddin Ahmed Khan
4. Srimati Sumitra Devi
5. Sri T. Lakshminarayana Reddy
6. Sri M. Pallam Raju
7. Sri Namburi Srinivasa Rao
8. Sri Ramachandra Rao (Sultanabad-General)
9. Sri Arege Ramaswami
10. Sri H. Ramalinga Reddy
11. Sri Baddam Yella Reddy
12. Sri V. Visweswara Rao
13. Sri M. Satyanarayana Raju
14. Sri R. B. Ramakrishna Raju
15. Sri Srinivasa Rao (Bodhan)

As the number of candidates validly nominated is equal to the number of vacancies to be filled namely—fifteen, I hereby declare them to have been duly elected to the Committee of Privileges.

Under sub-rule (1) of Rule 172 of the Andhra Pradesh Legislative Assembly Rules, the Deputy Speaker shall be a member ex-officio.

Under sub-rule (4) of rule 172 of the Andhra Pradesh Legislative Assembly Rules, I hereby nominate Sri R. B. Ramakrishna Raju to be the Chairman of the above Committee.

## *PAPERS LAID ON THE TABLE OF THE HOUSE RULES ISSUED UNDER SECTION 16 OF THE MADRAS MOTOR VEHICLES (TAXATION OF PASSENGERS AND GOODS) ACT, 1952*

*The Chief Minister, (Sri N. Sanjiva Reddy)*: Sir, I beg to lay on the Table under Sub-section (5) of Section 16 of the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) Act, 1952

a copy of the rules issued under Section 16 of the said Act, published in Rules Supplement to Part-I of the Andhra Pradesh Gazette dated the 12th June, 1958.

*Mr. Speaker*:—Paper laid on the Table.

### *AMENDMENTS TO THE ANDHRA PRADESH GENERAL SALES TAX RULES, 1957*

*Sri K. Brahmananda Reddy*:—Sir, I beg to lay on the Table under Sub-section (4) of Section 39 of the Andhra Pradesh General Sales Tax Act, 1957, a copy of the amendments to the Andhra Pradesh General Sales Tax Rules, 1957 published at page 388 of the Rules Supplement to Part-I of the Andhra Pradesh Gazette dated 31st July 1958.

*Mr. Speaker*:—Paper laid on the Table.

### *LEAVE OF ABSENCE TO SRIMATHI KUSUM GAJAPATHI RAJU*

*Sri B. Ratnasabhapathy*:—Sir, I beg to move:

"That under Rule 265 of the Assembly Rules, leave of absence be granted by this House to Srimathi Kusum Gajapathi Raju, Member, Andhra Pradesh Legislative Assembly for this Session."

*Mr. Speaker*:—The question is:

"That under Rule 265 of the Assembly Rules, leave of absence be granted by this House to Srimathi Kusum Gajapathi Raju, Member, Andhra Pradesh Legislative Assembly for this Session."

The motion was adopted and leave granted.

### *PRESENTATION OF THE REPORT OF THE SELECT COMMITTEE ON THE MADRAS LAND ENCROACHMENT (ANDHRA PRADESH EXTENSION AND AMENDMENT) BILL, 1958 (L.A. BILL 20 OF 1958)*

*The Minister for Revenue (Sri K. Venkat Rao)*:—Sir, I present the Report of the Select Committee on the Madras Land En-

croachment (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.

*Mr. Speaker*:—The Report presented.

## *GOVERNMENT BILLS*
## *THE ANDHRA PRADESH CEILING ON AGRICULTURAL HOLDINGS BILL, 1958*

*Sri K Venkat Rao*.—Sir, I beg to move

A

"That the Andhra Pradesh Ceiling on Agricultural Holdings Bill, 1958 be read a first time.

B

That the Bill be referred to a Joint Select Committee consisting of 32 members @ 24 members from this Assembly and 8 members from the Legislative Council, that this Assembly recommends to the Council that Council do join the said Joint Select Committee and communicate to the Assembly the names of the members to be appointed by the Council to the said Joint Select Committee."

@ List of names will be furnished on the Floor of the House.

*Mr. Speaker*:—Motion moved

శ్రీ కె. వెంకటరావు:—ఈ బిల్లును ప్రతిపాదిస్తూ నేను యివ్వాళ దీనిలో ఉన్నటువంటి విషయాలను సవిస్తరంగా చెప్పదలచాను. ఇందుపై యింతవరకు వచ్చినటువంటి విమర్శలకు, యీ రెండు మూడు రోజులలో రాబోయేటటువంటి విమర్శలకు చిట్టచివర సమాధానం చెప్తాను. ఇదివరకు పత్రికలలో, ప్రభుత్వానికి వచ్చినటువంటి నివేదికలలో, representations లో చాలా విషయాలు ప్రభుత్వానికి చెప్పబడ్డాయి. కాని యిప్పుడున్నటువంటి కాలాన్ని దానికోసం వినియోగించకుండా గౌరవ సభ్యులు చెప్పేటటువంటి విషయాలను కూడా గుర్తులో పెట్టుకొని అన్ని విషయాలకు కలిపి చివర సమాధానం చెబితే బాగుంటుందని అనుకుంటున్నాను.

ప్రపంచం జనాభా మొత్తం 130 కోట్ల మందిలో 100 కి 60 మంది వ్యవసాయం మీదనే జీవనాధారం గడుపుకుంటున్నారు. ఈ 130 కోట్లలో 100 కోట్ల మంది ఆసియా, ఆఫ్రికా, Central South America లో నివసిస్తున్నారు.

16 కోట్ల 20 లక్షలు మాత్రం Europe, North America లలో ముఖ్యంగా పారిశ్రామిక దేశాలలో నివసిస్తున్నారు. దానినిబట్టి యూరప్ దేశంలో ముగ్గురిలో ఒకరు ఉత్తర అమెరికా దేశంలో, అయిదుగురిలో ఒకరు ఆసియా, ఆఫ్రికా దేశాలలో నలుగురిలో ముగ్గురు భూమి మీదనే జీవనం గడుపుతుంటున్నారని తెలుస్తోంది. ఇటువంటి వ్యవసాయదేశంలో ప్రతి ఎకరానికి వచ్చేటటువంటి ఉత్పత్తి. (level of out-put) ప్రతి వ్యక్తికి కూడా చాలా తక్కువగా ఉన్నది. పారిశ్రామిక దేశాలలోకంటె చాల తక్కువగా ఉన్నదనే మనం చెప్పవలసి ఉన్నది. పారిశ్రామిక దేశాలలో వ్యవసాయంలో కూడా ఎకరానికి సగటున 2 1/2 టన్నుల ఉత్పత్తి. ఆసియాలో టన్నులో 4వ భాగం, ఆఫ్రికాలో టన్నులో 8వ భాగం మాత్రమే వస్తున్నవి. దీనికి కారణాలు ఏమిటీ అని మనం ఆలోచించినట్లయితే—భూములలో సారం తక్కువగా ఉండడం, అననుకూలమైన వాతావరణ పరిస్థితులు, వ్యవసాయం చేయడంలో ఉపయోగించేటటువంటి పద్ధతులు చాలా వెనుకబడి ఉండి నూతన పద్ధతులు ప్రవేశపెట్టేందుకు కావలసిన పనిముట్లు ఎగ్గిరాలు దొరకకపోవడం మొదలైనవన్నీ కూడా ప్రధానమైన కారణాలుగానే మనం గుర్తించవలసి ఉన్నది. గ్రామీణ ప్రాంతాలలో చాల హెచ్చుమంది జనాభా ఉండడం కనిపిస్తున్నది. అందువల్ల వ్యవసాయదారునకు తాను పండించే పంట మీద లభించే ఆదాయం చాలా స్వల్పంగా ఉన్నదని మనవి చేస్తున్నాను. ఇంకో విషయం కూడా మనం యీ సందర్భంలో గుర్తుంచుకోవాలి. గ్రామంలో ఉన్నటువంటి జీవన పరిమాణ వ్యవస్థ యిటువంటి స్థితిలో ఉండడానికి ప్రధానమైన కారణం ఇప్పుడు అమలులో ఉన్నటువంటి వ్యవసాయ పద్ధతే అని ప్రత్యేకంగా చెప్పవలసి ఉన్నది. వ్యవసాయ వ్యవస్థ యొక్క స్వరూపం (ograrian structure) భూమియొక్క శిస్తు విధాన పద్ధతి (land lenure) legal or customary systems of owning land (భూస్వామ్యం) శాస్త్రరీత్యాగాని, సాంప్రదాయరీత్యాగాని, ఎలాగ వ్యక్తులకు చెందుతోంది? భూమి పెద్ద పెద్ద కమతాల క్రింద, కృషీవలులయొక్క చిన్న కమతాల క్రింద. యీ రెండింటి మధ్య వివిధ తరగతులలో ఉండే పరిణామాలు కూడా యీ వ్యవస్థ యొక్క స్వరూపంలో ఒక భాగమే. ఇంతేకాదు భూమిమీద పండించేటటువంటి పంట, భూస్వామి అనుకొనేవానికీ ఆయన క్రింద పనిచేసే వానికీ మధ్య ఏవిధంగా పంపిణీ చేయబడుతోంది అనే విషయం కూడా మనం యీ సందర్భంలో ఆలోచించాలి. అంతేకాదు. వ్యవసాయ పెట్టుబడి ఎలా వస్తోంది, ఉత్పత్తి ఎలా కొనసాగుతోంది, తయారైనటువంటి పదార్థాలను బజారులో ఎలా అమ్ముకుంటున్నారు అనేది ఆలోచించాలి. తరువాత మనం యిచ్చేటటువంటి పన్నులు మొదలైనవన్నీ కూడా ముఖ్యమైన విషయాలే వ్యవసాయాభివృద్ధికి అనుకూలంగా ప్రభుత్వం గ్రామీణ ప్రాంతాలలో ఉండే ప్రజలకు ఏవిధంగా సహాయం చేస్తున్నది.

Technic.l alvices ఏమి యిస్తున్నది? విద్య—వ్యవసాయ విద్యగాని, యితర విద్యగాని—ఏవిధంగా యిస్తున్నది, ఆరోగ్య పరిస్థితులు ఎలా ఉన్నాయి, నీటి వనరులు ఎలా వున్నాయి, రహదారులు ఎలా వున్నాయి? మొదలైనటువంటి విషయాలనుకూడా మనం యీ సందర్భంలోనే ఆలోచించుకోవాలి. అన్నిటి కంటే ముఖ్యమైన విషయం ఒకటి ఉన్నది. వ్యవసాయ కూలీలకు మనం యిచ్చే కూలి ఏ పద్ధతిమీద-కనీసం ప్రమాణం మీద యిస్తున్నామా, లేక గరిష్ట ప్రమాణం మీద యిస్తున్నామా అనే విషయమును కూడా అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూషనల్ సిస్టంకుసంబంధించినవిషయముగాఆలోచించవలసియున్నది. ప్రస్తుతవ్యవసాయ వ్యవస్థవల్ల ఏర్పడుతున్న ఆర్థిక పరిస్థితి ఏమిటి? దీనిని ఆర్థిక పురోభివృద్ధికి ఎలా వినియోగించు కుంటున్నాము అనే విషయాన్ని కూడా చూసుకోవాలి. ఈ వేళ ఉన్న వ్యవసాయ పరిస్థితుల ఫలితంగా మన వ్యవసాయదారుని యొక్క (stanlard of living) జీవన ప్రమాణం తగ్గుతోంది. ఎంత కష్టపడి ఇన్టెన్సివ్‌గా పనిచేసినా లాభం తప్పకుండా వస్తుంది అనే నమ్మకం లేదు. ఆదాయాలు స్వల్పంగా ఉండడం వల్ల వ్యవసాయం మీద గాని, పరిశ్రమల మీదగాని, పెట్టుబడి పెట్టుకోవడానికి అగ్రికల్చరల్ సర్‌ప్లస్ కావలసినంత దొరకడం లేదు. కొన్ని వ్యవసాయ క్షేత్రాలనుంచి ప్రొడక్షన్ రావడమే కష్టమై పోతోంది. కొన్నిచోట్ల చాలా పెద్ద విస్తీర్ణం ఉండి కేంద్రీకృతమైన దృష్టితో వ్యవసాయం చేయడానికి అస్కారం కలగడం లేదు. ఈ పరిస్థితులన్నీ దీనికి సంబంధించి ఉన్నప్పటికీ, దేశ దేశానికి, ప్రాంత ప్రాంతానికి వాతావరణ పరిస్థితులు వివిధ రీతులలో ఉండడం వల్ల యిది క్లిష్ట సమస్యగా తేలుతోంది.

ఇక, భూమికి సంబంధించిన పాలసీ ఏలాంటిది అనే విషయం మరొకటి ఉన్నది. మనం కోరుకొనేది ఏమిటి? ఇట్టి క్లిష్ట పరిస్థితులనుంచి మనం బయట పడడానికి ఏమి చేయాలి? ఎకనామిక్ ఎఫిషియన్సీ కావాలి, అంటే సామర్థ్యంతో వ్యవసాయమునకు సంబంధించినంతవరకూ ఆర్థిక వ్యవస్థను పెంపొందించుకోవాలి. సోషల్ వెల్‌ఫేర్ అంటే సాంఘిక క్షేమం కావాలి. అన్నింటి కంటే ముఖ్యంగా (యిండివిడ్యుయల్ ఫ్రీడం) వ్యక్తి గతమైన స్వేచ్ఛ కావాలి. వ్యవసాయం చేసుకొనే వ్యక్తికి తన దృష్టి ప్రకారం వ్యవసాయం చేసుకునేందుకు స్వాతంత్ర్యం ఉండాలి ఈ మూడు ఉద్దేశాలతో యిప్పుడువున్న వ్యవసాయ పరిస్థితి ఏరకంగా ఉన్నదో చూసుకోవాలి.

నేను చెప్పిన తారతమ్యాలన్నీ ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి మారటమే కాకుండా ఒక హోల్డింగుకూ మరొక హోల్డింగుకూ కూడా మారుతున్నాయి. కొన్నిచోట్ల పంటలోనే మార్పులు వస్తున్నాయి. ఒక పంటకూ మరొక పంటకూ అనేకమైన మార్పులు ఉండే పరిస్థితిలో ఉన్నది మన వ్యవసాయం. మన

గ్రామ ప్రాంతాలలో స్థానికంగా ఉండే ప్రజలను ఐదు భాగాల విడదీయవచ్చు. (యాబ్సెంటీవ్ ఓనర్స్) అంటే భూమి అక్కడ ఉంటుంది, పట్టా ఉంటుంది. కాని ఆ భూమి గలవారు మాత్రం అక్కడ ఉండడంగాని, వ్యవసాయం చేయడం గాని జరుగదు. (Families with large holdings) ఎక్కువ భూస్వామ్యం గలవారు. (Subsistence and low income families) కావలసిన దానికంటే తక్కువ ఆదాయం తెచ్చుకుంటూ, జీవితము గడుపు కొనేవారు, అంటే జీవన ప్రమాణం గడపడమే కష్టంగా ఉండి, తక్కువ ఆదాయం గలిగిన వ్యవసాయదారులు. భూమి లేకుండా భూమి మీద పనిచేసే కూలీలు. గ్రామాలలో వ్యవసాయంతో సంబంధంలేని కూలీలు కూడా ఒక రకంగా ఉన్నారు. ఈ వ్యవహారం యీ పై ఐదు రకాలుగా ఉన్నది. ఈ పరిస్థితులలో మన భారత జాతి పురోభివృద్ధికి అనుకూలమైన విధానాలు ఉన్నాయా, లేవా అనే విషయం తెలుసుకోవాలి. తెలుసుకొనేటప్పుడు యీ పరిస్థితులు మన దేశములోని సంఘమునకు తృప్తిని కల్గిస్తున్నవా, లేవా? అనేది చూడవలసియున్నది. మన పురోభివృద్ధికి యిదే గీటురాయి. తరువాత, ఇప్పుడు వచ్చే పంట వల్ల, ఉన్న పద్ధతుల వల్ల జీవితమును బాగా సాఫీగా సాగించుకొనే అవకాశ మున్నదా లేదా? అంటే శరీరమును బలవంతకరంగానూ, ఉత్సాహ జనకంగానూ చేసే పరిస్థితి ఉన్నదా లేదా? అనేది చూసుకోవలసి యున్నది. సంఘ వ్యవస్థకు స్థిరత్వమును చేకూర్చే విప్లవ రహితమైన పరిస్థితులు సంఘములో వున్నవా లేవా? అనేది కూడా చూసుకోవలసి యున్నది. వీటన్నిటినీ చూసుకున్న తరువాత, ఏ రకంగా వ్యవసాయం చేస్తే ఆదర్శవంతంగా ఉంటుంది అనే విషయంకూడా తేల్చుకోవాలి. దీనిని తెలుసుకునే ముందు ఒక ముఖ్య విషయాన్ని గుర్తుంచుకోవాలి. నేను మొట్టమొదటనే చెప్పినట్లుగా, అక్కడవున్న ప్రాంత పరిస్థితులను బట్టి, పురోభివృద్ధిని బట్టి సారాన్ని బట్టి, ఇంకా యితర విషయాలను బట్టి ఏ రకంగా, ఏ ప్రమాణంలో వ్యవసాయం చేసుకొనేందుకు వీలుంటుందనే విషయం చూచుకోవాలి. ఇందులో ఒక్క విషయాన్ని గుర్తించవచ్చు. పెజంట్ ఫార్మింగ్ (డైవర్సిఫైడ్ అగ్రికల్చర్ తో) ఇన్‌టెన్సివ్‌గా కేంద్రీకృతమైన పద్ధతిలో వ్యవసాయం చేస్తే బాగా పండించటానికి వీలుంటుందనే విషయం మాత్రం అంగీకరింపక తప్పదు. ప్రపంచంలో యింకొక వాదన ఉన్నది. ఎస్టేట్ ఫార్మింగ్ అంటే మరలు తెచ్చి ఉపయోగించి వ్యవసాయం చేస్తే ఒక విషయం తేలింది. బాగా ఎక్కువ భూమి దున్ని సమర్థవంతంగా వ్యవసాయం చేయ వచ్చునని తేలింది. కాని, దానివల్ల వచ్చే ఉత్పత్తి మామూలుగా పెట్టుబడి పెట్టగలిగిన వ్యవసాయదారు చిన్న కమతంమీద పెంపొందించ గలిగిన ఉత్పత్తిని యీ ఎక్‌స్టెన్సివ్ కల్టివేషన్ తీసుకువస్తుందా, లేదా అనే విషయం ఇంకా యీ ప్రపంచంలోనే ఋజువు కాలేదు. ఋజువు అయిందని కొంతమంది అంటున్నారు. లేదని కొన్ని ఋజువులు వస్తున్నాయి. ఇంతవరకూ ఏమీ స్థిరం లేదు. 500 ఎకరాకల ఫారం

పెట్టి ఒక చోట వ్యవసాయం చేస్తే ఎకరానికి చిన్న వ్యవసాయదారు పండించిన దాని కంటే ఎక్కువ పండించ గలుతారా అనే విషయం యింకా ఋజువు కాలేదు. ఈ విషయాన్ని గుర్తుంచుకోవలసి యున్నది.

ప్రొడక్టివిటీ ఆఫ్ ది హోల్డింగ్స్ అంటే కమతము యొక్క ఉత్పత్తి పరిస్థితులను మనము ఏ రకంగా బాగుచేయవచ్చు, అనే విషయం ఉన్నది. దీనికి ఒక సైజు లేదు 100, లేక 50 ఎకరాలు అనే బాధ లేకుండా మొత్తంఉన్న భూములమీద ఎక్కువపెట్టుబడి పెట్టి పనిచేస్తే వచ్చే ఫలితం ఒక విస్తీర్ణంలో ట్రాక్టరులను ఉపయోగించి చేయడం వల్ల రావడం లేదనే విషయం యింతవకు ప్రపంచంలో జరిగిన ఎంక్వైరీల వల్ల తేలింది. రైతులకు ఎంతభూమి, ఎంత భారం ఉండాలనే విషయం తరువాత వస్తుంది. మన దేశంలో ఉన్న వ్యవసాయ పరిస్థితిని భూ సంస్కరణలు తెచ్చిన రోజునే బాగుపర్చగలమన్న ఉద్దేశంలోనే నేనూ, ప్రభుత్వము కూడా ఉన్నాము.

'Better utilis ,tion of existing l ,bour force' అనేదికూడా ఉన్నది ట్రాక్టరుల నుపయోగించి వ్యవసాయం చేస్తే ఒక ఎకరమునకు 10 మంది కూలీలకు పని పోతుంది. నా తరఫున మా మేనల్లుడు మా పొలమును చేయుచున్నాడు. ఆ భూమిలో ట్రాక్టరులను ఉపయోగించి వ్యవసాయం చేసినందువల్ల దాదాపు 20, 30 మంది హరిజన కూలీలకు పనులు లేకుండా పోయినాయి అని చెప్పినారు. వారు యించుమించు 120 సంవత్సరాల నుంచి కూలి పనులు చేసుకుంటూ ఉన్నారు. మరలు తీసుకు రావడం వల్ల కూలీలకు పనులు దొరకవు, పెజంట్ ఫార్మింగ్ ఉండడం వల్ల లేబర్ ఎక్కువగా పనులు చేయడానికి వీలుంటుందనే విషయం ఒకటి తేలుతోంది. పెట్టుబడి కూడా కొంత తక్కువ అవుతోంది. మనిషివారీ ఉత్పత్తి ఎక్కువ కనిపిస్తోంది. ఎక్కువ మనుష్యులకు పనులు కల్పించి ఉత్పత్తిని ఎక్కువ చేసే పరిస్థితి కూడా ఉన్నది. ఈక్వల్ డిస్ట్రిబ్యూషన్ అన్నమాట. మనము యిచ్చేకూలీ ఒకరిద్దరికే కాక, చాలామందికి అందే అవకాశం కలుగుతోంది. దీనిని యింకా అనేక రకాలుగా మార్చుకోవచ్చు. వారికి కావలసిన కొన్ని పదార్థాలున్నాయి. పెట్టుబడికి కావలసిన పదార్థాలు, తరువాత వారు పండించిన పంటల అమ్మకం సౌకర్యాలు కావాలి. మనం మామూలుగా దీనిని పర్చేజ్ అండ్ సేల్ అంటున్నాము దానికి సర్వీస్ కో-ఆపరేటివ్ అని పేరు పెట్టినారు. పెట్టుబడి చేయడంలో పరపతి కల్పించడంలో, పండిన పంటను అమ్మడంలో—బాగా ఉపయోగిస్తుందని నిర్ణయం తీసుకోక తప్పదు.ఆ తరువాత, దేశంలో those who employ hired l bour.కూలీలను పెట్టుకొని వ్యవసాయం చేసే వారు, those who offer for hirey కూలీలుగా వ స్తామని తయారయ్యే వారు ఉన్నారు

ఇక మిగిలిన వారు యీ యిద్దరి మధ్యవారు. ఈ రకంగా దేశంలో యీ వ్యవహారం ఉన్నది. ఇంతవరకూ జరిగిన దంతా మనస్సులో పెట్టుకొని ప్రస్తుత వ్యవహారం నడుపుతాము. నేను ఒకసారి క్రిందటి బడ్జెట్ సమావేశంలో కాబోలు, మాట్లాడుతూ నాలుగు ప్రశ్నలు వేసుకున్నాను. (who owns land?) భూమి ఎవరి స్వామ్యం? (who works it?) ఎవరు పండిస్తారు? (what is the product?) దాని మీద వచ్చే పదార్థాలు ఏమిటి? (who gets and what shares of this product?) పండిన పంట ఎవరికి ఏ భాగంలో చెందుతోంది?

(Mr Deputy Speaker in the Chair)

ఈ నాలుగు విషయాల మీద మొత్తం వ్యవహారమంతా ఆధారపడి ఉంది. అందుచేత భూసంస్కరణలు తీసుకరావలెనే యీ ప్రశ్నలకు సరియైన సమాధానం చెప్పడానికి గాను, చెప్పిన సమాధానాన్ని అమల్లోపెట్టి దేశం యొక్క అభివృద్ధి యానికి తోడ్పడడానికి వీలులేదు గనుక—యీ భూసంస్కరణలను మన దేశాని కంతటికీ సంబంధించిన—ఒక ఆవశ్యకప్రాయమైన, అత్యంత ముఖ్యమైన కార్య క్రమంగా భావించవలసి ఉంది. అందువల్ల ముందుగా మనం వ్యవసాయిక వ్యవస్థ లో ఉత్పత్తికి అడ్డుగా ఉన్న లోపాలను తొలగించవలసి ఉంది. లేకపోతే మనమనుకున్న సంస్కరణలు తీసుకరావడం చాలా కష్టమవుతుంది. ఈ అడ్డు లను తొలగించుకున్నప్పుడే మనం పటిష్టమైన వ్యవసాయం చేయడానికి, మంచి వుత్పత్తిని సాధించడానికి, వ్యవసాయార్థిక వ్యవస్థ (Agricultural economy)ను సృష్టించుకొనే మార్గం ఏర్పడుతుంది. ఈ సదుద్దేశంతోనే నేను యీ బిల్లును తమముందు ప్రవేశపెడుతున్నాను. దీనికి సంబంధించిన మరొక విషయం తమకు మనవి చేయాలి. ఈ బిల్లు అన్ని విషయాలనూ సమగ్రంగా అంతర్గతం చేసుకొనే స్థితిలో లేదు. It is not a comprehensive Bill. కావలసినసంస్కర ణలను కోరడానికి ఉపయోగించే ఒక aspect ను గురించే యీ బిల్లు deal చేస్తుంది. అందువలన సభ్యులకు తమ ద్వారా మనవి జేసేది యీ బిల్లుతో బాటు యింకా ఒక series of Bills దీని వెనుక రానున్నవి, కొన్ని దీని తరువాత, దీనితోపాటు. దీని వెంబడివచ్చే బిల్లులు. అవన్నీ అమలు జరిగిన రోజునే నేను ముందువేసిన ప్రశ్నలకు సరియైన సమాధానం వస్తుంది. అంతేగాక భారతదేశం యొక్క అభ్యుదయానికి, సర్వశ్రేయస్సుకు తోడ్పడే వ్యవస్థ వస్తుంది. అందులో మొదటిది టెనెన్సీ బిల్లు. ఈ బిల్లులో టెనెన్సీని గురించి ఉంటుంది. అంతేగాని, భూస్వామికీ, కౌలుదారుకు మధ్య ఉండవలసిన relationship గురించి కాదు. దానికి సంబంధించిన బిల్లు త్వరలోనే ప్రవేశపెట్టబడుతుంది, తమముందుకు వస్తుంది. తరువాతది Minimum wages for Agricultural Labour కు సంబం ధించినది. దీనిలో వ్యవసాయ కూలీలకు కనీస వేతనం నిర్ణయించే చర్య తీసుకోవలసి ఉంది. దీనికి సంబంధించిన బిల్లు కూడా వస్తుంది.

తరువాత policy of land assignment, ప్రభుత్వానికి యీ బిల్లు ప్రవేశపెట్టడం వలన—అంటే గరిష్టపరిమితిని నిర్ణయించడం వలన వచ్చే ఎకరాలు బంజరు వగైరాలలో వున్న 32 లక్షల ఎకరాలు (surplus land) ప్రజానీకానికి ఎలా అందజేయాలి అనే వుద్దేశం ఒకటి వున్నది. దీనికి సంబంధించిన సమాచారం సభ్యులందరికీ యిదివరకే పంచిపెట్టడం జరిగింది. ఇంకా అందులో ఏమైనా లోపాలుంటే తరువాత సరిదిద్దుకుందాం.

ఇక హైదరాబాదు లాండ్ ఆక్టులో 47వ సెక్షను వుంది. ఆ సెక్షనులో కలెక్టరు యొక్క అనుమతి లేనిదే ఎవరూ భూమిని అమ్మకూడదు అని వుంది. దీనిని సవరించి—యీ మధ్య జరిగిన transactions అన్నీ valid చేయడం కోసం ఒక బిల్లు తమ ముందుకు వస్తుంది.

తరువాత, Land management కు సంబందించినది. ఇందుకు సంబంధించి ఒక ఉదాహరణ చెబుతాను—'మా నాన్నగారు 20 లక్షల రూపాయల వరకు సంపాదించి వెళ్ళారు, నాకు యింకా చాలా భూమి వుంది' నేను పొలం వెళ్ళక పోయినా జీవనం గడుస్తుంది—అందుచేత నేను పొలం దున్ననేదున్నను' అని ఎవరైనా ఊరుకుంటే దేశంలో ఆహారోత్పత్తి తక్కువగా వున్నది గనుక inefficient గా manage చేసేటటువంటి భూములను ప్రభుత్వమే తీసుకొని దానిని మంచి ఉత్పత్తిలోకి తీసుకు వచ్చేందుకు సంబంధించిన బిల్లు కూడా వస్తున్నది

తరువాత Consolidation of holdings కు సంబంధించినది. చిన్న చిన్న పీలికల క్రింద చీలిపోయిన వ్యవసాయ క్షేత్రాలను సమీకరించే బిల్లు యిది

Cooperative farming యిది సహకార వ్యవసాయానికి సంబంధించిన బిల్లు. తరువాత Equalisation of Land Revenue and water rate assessment కు సంబంధించి "అనంత రామన్ కమిటీ" ఒకదానిని వేశామని చెప్పాను. దీనికి సంబంధించి వున్న తేడాలను సవరించి అసలు పునాది సిద్ధంగా ఎలా వేయాలి? అనే విషయాలను చర్చించే శాసనమొకటి వస్తున్నది. మిగిలినవి భూదానం, గ్రామదానంకు సంబంధించినవి.

ఆఖరున—యిక్కడ Land Revenue Code ఉందిగాని, మద్రాసు, ఆంధ్రలో యిదివరకు Board Standing Orders క్రిందనే Land Revenue వ్యవహారమంతా నడుస్తున్నది. అందువలన ఈ రెంటినీ సమీకరించ వలసి యున్నది. ఇంత పని మన వద్ద వున్నది. అయితే వీటన్నిటినీ కలిపి ఒక బిల్లులో పెట్టవచ్చు. కష్టమేమీ లేదు—కాని అందువల్ల అవసరమైన విషయాలు మన కంటికి కనిపించకుండా దాటిపోతాయి. ఎవరైనా ఒక్క గరిష్ట పరిమితిని

గురించే చర్చిస్తూ కూర్చున్నట్లయితే నేను చెప్పిన యితర చిన్న విషయాలు బిల్లులో ఏ మూల వున్నాయో గమనించడం కూడా కష్టమవుతుంది. అంతేగాక—మనమంతా ఏకేంద్రీకృతమైన దృష్టితో యీ విషయాలన్నీ సమగ్రంగా పరిశీలించినట్లయితే ప్రజానీకానికి జరిగే వుపకారం చాలా విస్తృతంగా వుంటుందనే వుద్దేశంతో యీ విధంగా proceed కావడానికి నిర్ణయం జరిగింది.

ఇప్పుడు నేను సభవారికి మనవిచేయదలచే విషయాలు మొదటి పంచవర్ష ప్రణాళికలో చేర్చ బడినవి. అధికాహారోత్పత్తికి మొదటి priority యివ్వ బడినది. తినుబడి పదార్థాలను చాల ఎక్కువగా ప్రధానమైన ఉద్దేశంతో పండించాలి అనేది ముఖ్యమైనది. Diversification of agricultural economy ని విస్తృతం చేయాలి. నేను ఒక్క ధాన్యమే పండిస్తాను, అంటే పంటను పండించను అనే విధంగా కాకుండా అవసరమైతే రెండు, మూడు పంటలను, యితర పదార్థాలను పండించడానికి సంబంధించిన వ్యవహారమిది. తరువాత వ్యవసాయాన్ని మంచి సామర్థ్యంతో ఉన్నత స్థాయికి తీసుకు వెళ్ళడం. ఇది మొదటి పంచవర్ష ప్రణాళిక యొక్క అభిప్రాయాలు. వీటినే రెండవ పంచవర్ష ప్రణాళికలో విస్తృతం చేశారు.

ఇక వ్యవసాయిక కమతాలమీద యికముందు యింతకంటే భూమి ఎవరూ కొనగూడదు అనే నిర్ణయం చేయాలి. అటువంటి గరిష్ఠ ప్రమాణం మూడు కుటుంబ క్షేత్రాల క్రింద నిర్ణయించాలి. అసలు కుటుంబ క్షేత్రమంటే ఏమిటి? అనే ప్రశ్న వస్తుంది. "A family holding may be considered either as an operational unit or a share of land which can yield a certain average income" ఇది ఎలా వుండాలి? అనే విషయంమీద Planning Commission వారు ఒక sub-committee ని వేశారు. ఆ కమిటీ నివేదిక యింకా రాలేదు. కాని అందులో చర్చలు కొన్ని వచ్చాయి. ఆ కమిటీలోని సభ్యులెవరూ పొలాలకు వెళ్ళి పరిశీలించినట్లు కనిపించడం లేదు. Operational unit, ploughing unit, Estate farming unit ఇవన్నీ మనకే సరిగా తెలియవు గనుక మామూలు వ్యవసాయదారునికి తెలియడం చాలా కష్టం. దానిమీద base అయి agricultural ceiling పెట్టడం కష్టం గనుక మనం వారు చెప్పిన సలహాలను పాటించి నప్పటికీ, మనకువుండే కష్టసుఖాలను కూడా మనం నిర్ణయించు కోవలసి వుంటుంది. Planning Commission వారు ప్రతి రాష్ట్రమూ తనయొక్క స్థానిక పరిస్థితులను అనుసరించి యీ నిర్ణయం చేసు కోవచ్చును అని కూడా వ్రాశారు. అందువలన యీ గరిష్ఠ పరిమితి, వ్యక్తిక్రింద వుండాలా? లేక కుటుంబాల క్రింద గాని, క్షేత్రాలక్రింద గాని వుండాలా? అన్న విషయాలను మనమే నిర్ణయించుకోవచ్చును.

మరొక ముఖ్యమైన విషయ మేమంటే యీ విధంగా గరిష్ట పరిమితిని నిర్ణయించిన తరువాత ఆ యా రాష్ట్రాలు తమకు యిష్టమైతే కొన్ని తరగతుల యొక్క పంటలను గాని, కొన్ని తరగతుల భూములను గాని యీ గరిష్ట పరిమితి నుండి వెలుపల పెట్టవచ్చు. దానిలో అవి చేరదు.

అదేవిధంగా Tea, Coffee, Rubber plantations, orchards when they constitute reasonably, compact areas, special and farms, sugarcane farms operated by sugar factories efficiently managed farms consisting of compact blocks యివన్నీ వున్నవి. స్థానికంగా వున్న పరిస్థితులను బట్టి వీటిని మార్చుకొన వచ్చునని Planning Commission వారు చెప్పారు. వారు చేసిన సూచనప్రకారమే మన ఆంధ్రప్రదేశ రాష్ట్రం యొక్క పరిస్థితులను దృష్టియం దుంచుకొని యీ బిల్లు సభ ముందుకు తీసుకు రాబడింది.

ఈ బిల్లుయొక్క స్వరూపం తెలియజేసేముందు యింతకుముందు ఆంధ్రలో యీ విషయమై జరిగిన పనిని గురించి కొన్ని విషయాలు తమ ముందుకు తీసుకు రావలసి వున్నది.

1954 ఆగస్టులో ఆంధ్ర ప్రభుత్వం లక్కరాజు సుబ్బారావుగారి ఆధ్వర్యం క్రింద ఒక కమిటీని నియమించింది. ఆ కమిటి 1955 వ సంవత్సరాంతంలో తమ నివేదికను అందజేసినది. ఆ కమిటి యొక్క సిఫార్సులను పరిశీలించి అక్కడి ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకున్నది. అందులో ప్రధానంగా land lord and tenant relationship, fair rent అనగా న్యాయమైన శిస్తు, కౌలుదారు కాల పరిమితిని గురించి ప్రభుత్వం చర్య తీసుకున్నది. దానినే Andhra Tenancy Act 1956 అంటారు అప్పుడు ఈ గరిష్ట పరిమితి విషయం గూడ చర్చకు వచ్చినది. గాని హైదరాబాదులో గరిష్ట పరిమితికి సంబంధించి ఒక శాసనం ఉన్నందున త్వరలో యిక్కడికి వచ్చే విషయం నిర్ణయమైనందున యిక్కడికి వచ్చిన తరువాత రెంటిని కలపి ఒక సమగ్రమైన శాసనం చేసుకొనుట మంచిదనే అభిప్రాయంతో అప్పుడు యీ గరిష్టపరిమితికి సంబంధించిన శాసనం పెట్టకూడదని నిర్ణయించడం జరిగింది. 1954 వ సంవత్సరం లోనే శాసనబద్ధంగా కాకుండా Andhra census of land holdings ను తయారుచేసి ఒక పుస్తకం ప్రభుత్వం ప్రకటించింది. దాని వల్ల కమతాలన్నీ చాలా చిన్నవిగా ఉన్నవనీ, కమతానికి, కమతానికి మధ్య చాలా వ్యత్యాసం ఉన్నదని తేలినది. 30 standard acres కు పైనవున్న కమతాల సంఖ్య 8 మాత్రమే ఉన్నవి. ఐతే individual holdings మొత్తం విస్తీర్ణంలో 13.3 ఎంతులు ఉన్నవి. Holdings number 8 ఐనా holdings యొక్క extent మాత్రం

13.3% (of the total acreage under cultivation) వరకు ఉన్నది. హైదరాబాదు Act లోని ప్రధానమైన అంశాలను మీకు మనవి చేస్తాను. హైదరాబాదు లోని 1950 Act తరిమిలా amendments ప్రకారం (1) వర్తమాన, భవిష్యత్తుకు గూడ కమతాల గరిష్ఠ ప్రమాణం నిర్ణయించ బడినది. Existing holdings లో 4 1/2 రెట్లు కుటుంబ క్షేత్రాల క్రింద ఉండాలనీ, భవిష్యత్తులో మూడు రెట్లు ఉండాలని కూడా నిర్ణయం జరిగింది. అనగా కుటుంబ క్షేత్రంయొక్క నికర ఆదాయం గాక మొత్తం ఆదాయం సాలుకు 16 వందల రూపాయలు ఉండాలి. ఈ నిర్ణయం ప్రకారం land commission వారు రాష్ట్రం మొత్తంమీద 1600 రూపాయలు ఆదాయం వచ్చే ప్రదేశాలు ఏవో, స్థానిక క్షేత్రాలేవో నిర్ణయం చేశారు. ఈ నిర్ణయించ బడిన పద్ధతి ప్రకారం 21 ఎకరాలనుంచి 60 ఎకరాలవరకు కుష్కి భూములు, 6 ఎకరాల నుంచి 9 ఎకరాలవరకు తరి భూములు. కుటుంబ క్షేత్రం యొక్క విస్తీర్ణమని తెలుస్తున్నది. అందువల్ల భవిష్యత్తులో కుటుంబ క్షేత్రం 63 ఎకరాల నుంచి 180 ఎకరాల వరకు కుష్కి భూమి, 18 ఎకరాల నుంచి 27 ఎకరాల వరకు తరి భూమి అని తేలుతున్నది. Existing holdings విషయములో సీలింగు 94 ఎకరాల నుంచి 274 ఎకరాల వరకు కుష్కి భూమిమీద. 27 ఎకరాలనుంచి 40 1/2 ఎకరాల వరకు తరి మీద వేయాలని ఈ కమీషన్‌వారు చేసిన విచారణవల్ల తేలినది. ఈ సీలింగు అవిభాజ్యమైన హిందూ కుటుంబాలైనా వర్తిస్తుంది. కాని హైదరాబాదు చట్టం ప్రకారం family కి మాత్రం యింకో additional కుటుంబ క్షేత్రం యివ్వవచ్చు. అనగా యిద్దరన్నదమ్ము లుంటే, తమ్ముడు చనిపోయి అతని కొడుకులున్నప్పుడు, రెండవ కుటుంబంలో ఉన్నతనికి గరిష్ఠ ప్రమాణం మించకుండా యింకొక కుటుంబ క్షేత్రం యివ్వవచ్చు. తరువాత వానికి నష్టపరిహారం యిచ్చే పద్ధతి గూడ నిర్ణయించారు. ఈ నష్ట పరిహారం ధన రూపంలోగాని, బాండు రూపంలోగాని యివ్వవచ్చు. ఆ compensation కుష్కి భూమికి 20 రెట్లు fair rent క్రింద. తరి భూమికి (బావుల క్రింద సాగయ్యే భూమి) 12 రెట్లు fair rent క్రింద, wet lands (irrigated by other sources) కు 9 రెట్లు యివ్వవచ్చు. ఈ విధంగా యిచ్చు పరిహారం మార్కెటు విలువకంటె ఎక్కువ కారాదని చెప్పాము. Fair rent అనగా భూమి శిస్తుకు నాలుగు రెట్లు. దానిని నేను చెప్పిన ప్రకారం గుణించి నష్టపరిహారం యివ్వాలి. అనగా కుష్కి భూములకు land revenue కు 80 మొదలు నూరు రెట్లు, తరిభూములకు 36 రెట్లు పరిహారం యివ్వవలసి వస్తుంది. తరువాత 1952, జనవరి 1 వ తేదీకి నాటబడ్డ తోటలకు వీనిలో exemption యిచ్చారు. ఈనాం భూములలో కొన్ని తరహాలకు, religious charitable institutions కు కూడ సీలింగు నుండి exemption యిచ్చారు. భవిష్యత్తులో హైదరాబాదు రాష్ట్రం మొత్తానికి గరిష్ఠ పరిమితి వర్తింప జేశారు. కాని వర్తమాన గరిష్ఠ

పరిమతిని తెలంగాణకు సంబంధించినంత వరకు ఖమ్మంమెట్టు జిల్లాలోను, వరంగల్ జిల్లాలోని ములుగు తాలూకాలో మాత్రమే ప్రవేశ పెట్టారు. మొత్తం హైదరాబాదు స్టేటులో ఉన్న భూ ఫలితాల సెన్సస్ ప్రకారం ఖమ్మం జిల్లాలో 92 వేల ఎకరాల భూమి, (92 వేల converted acres), ములుగు తాలూకాలో 32 వేల ఎకరాల (converted acres) వస్తవని అంచనా వేశారు. ఖమ్మం జిల్లాలో మొత్తం 517 మంది surplus holders ఉంటారని అనుకొన్నారు. గాని 342 మంది విషయంలో actual enquiry చేయగా 12 మందికి మాత్రమే surplus (గరిష్ట పరిమితిని మించిన) భూమి ఉన్నదని తేలినది. దానియొక్క విస్తీర్ణంకూడా 7040 converted Dry Acres అని తేలింది. అక్కడ 92 వేలు, యిక్కడ యింకా కొంత చేయాలనుకొంటే యిప్పటివరకు వచ్చింది 7040 acres అని చెప్పాను. ఇంకా 200 మంది విచారణ జరిగినప్పుడు అది ఎంత వస్తుందో వూహించు కోవచ్చు. ములుగుతాలూకాలో 77 మంది surplus land holders ఉన్నారనుకోండి. వారిలో 31 మంది విషయంలో విచారణ జరిగింది. వీరిలో ఒక్కరికి మాత్రం surplus land holding ఉన్నట్లు తేలింది. కాని యిక్కడ వచ్చిన converted dry acres 810. దీనిని బట్టి లెక్కించుకొన్నా మొత్తం ఒక లక్ష రెండు వేల రెండు వందల తొమ్మిది converted dry acres వస్తుంది. ఈ రెండు చోట్లా క్రియలో మూడువేల ఎకరాలకుమించి వచ్చేటట్లు కనిపించడం లేదు. దీనిని బట్టి తెలంగాణాలో అయిదు లక్షల converted dry acres surplus వస్తుందనుకొంటే, చాలా short fall ఉండేటట్లు ద్యోతకమౌతోంది. ఇవి హైద్రాబాద్ చట్టంలోని ప్రధానమైన విషయాలు. Co-operative Farming మొదలైన విషయాలు చెప్పడంలేదు. ఈ నాటి చర్చకు దీనికి సంబంధం లేదని వదలి వేస్తున్నాను. ఇలా ఉండగా ఆంధ్ర ప్రదేశ్ వచ్చిన తరువాత ఆంధ్ర రాష్ట్రంలో proper statutory census యిప్పుడు కావాలన్నా లేదు గనుక, అక్కడ ordinance చేసి, తరువాత ఒక Bill pass చేసి దా విషయం మనం తెలుసుకొన్నాము. ఈ ordinance ప్రకారం 20 acres కంటె ఎక్కువ భూమి ఉన్నవారందరి census మనం చూచుకొంటే వచ్చిన పరిస్థితులు యీ విధంగా వున్నాయి. Individuals and families number of owners holding more than 20 acres, ఒక లక్ష తొంభై వే ఏడు వందల ఏభై ఏడు. Extent of wet land held by these land owners 14, 22, 596 Acres. Dry land 73, 79, 298 Acres మొత్తం 88,01,894 Acres. Relegious & Charitable and Education holdings 2,935 Acres. మొత్తం 3,67,852 Acres. Commercial Enterprises 60, మొత్తం 21,846. దీని వల్ల ఏమి తేలిందంటే పా ఆంధ్ర రాష్ట్రం మొత్తంమీద Number of owners holding more than

20 Acres 1,93,750 మంది. వారి క్రింద 15,08,345 ఎకరాల తరి; 76,83,247 ఎకరాల ఖుష్కీ భూమి ఉంది. మొత్తం 91,91,592 ఎకరాల ఉంది. మిగిలిన భూమంతా 20 ఎకరాల లోపు వారి క్రిందే ఉందన్నమాట. ఈ సంఖ్య దృష్టిలో పెట్టుకొని ఏమి ముందున్న Bill లోని ముఖ్యమైన విషయాలు చెప్పదోచున్నాను. (1) ఈ Bill లో వర్తమానంలోను, భవిష్యత్తులోను కూడా గరిష్ఠ ప్రమాణాన్ని నిర్ణయించాలనే నిర్ణయం జరిగింది. వ్యవసాయ భూములంటే All land used or capable of being used for agriculture or porticulture that will not include lands used exclusively for non-agricultural purposes అని నిర్ణయం జరిగింది. వ్యవసాయం చేస్తున్నట్టి గాని, చేయడానికి కాని అనువైన భూమి. వ్యవసాయాని ఉపయోగించని భూమి, దీనిలోనిది కాదు. ఈ గరిష్ఠ ప్రమాణం all persons including Hindu Joint families, కంపెనీలు, firms, societies, associations మొదలైనవి వర్తింప చేయడం జరుగుతుంది. కాని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల భూములను, Religious & Charitable, Educational వగైరా సంస్థలకు, ప్రభుత్వం నిర్ణయించిన వ్యవసాయ సహకార సంఘాలకు మాత్రం యివి వర్తించదు. ఒక వ్యక్తి మొత్తం ఏమేరకంలో ఏమి చేటుతాయనేది కదువాల సమస్య. It would include all lands held by him as owners or limited స్వాధీనపు కనుఖాదారు. కౌలుదారు యివన్నీ కలిసిన వారికి నాలుగు ఎకరాల స్వంతభూమి. 10 Acres కౌలుభూమి. స్వాధీనపు కనఖా క్రింద 2 Acres ఉన్నా యివన్నీ లెక్కలోకి వస్తాయి. Hindu Joint Family క్రింది member గా ఉండి, అవిభక్త సమ్మిళితా ఉంటే, అతనికి అర్హగారు యిచ్చినది, లేక వేరే సంపాదించుకొన్న ఆస్తి ఉంటే అవి కూడా అతని గరిష్ఠ ప్రమాణంలో లెక్క వేసుకోవడానికి నిర్ణయం జరిగింది. ప్రస్తుతాంలో మొన్న ceiling కు సంబంధించి Rs 5,400/— ఆదాయంగల భూవసతి గరిష్ఠ ప్రమాణంగా ఉంటుంది. Rs. 5,400/— నికరాదాయమంటే మొత్తం ఆదాయంలో సగము. అసలు ఆదాయాన్ని లెక్క కట్టడంలో పెట్టుబడి విలువలు గత 10 సంవత్సరాల సగటును బట్టి ఉంటుంది. ఏ joint family లో నైనా వాటా అడగడానికి హక్కుగలవారు 5గురు కంటె ఎక్కువ ఉంటే ఆ పై వారందరికి family holding కు Rs. 1200/ ఆదాయం వచ్చే భూ భాగం చేర్చబడుతుంది. అంటే కొడుకు లైనా, మనుమలైనా అయి ఉండవచ్చు. తెలంగాణా చట్టంలో per-sterpis, ఇక్కడ per capita in excess of a particular number. ఈ ceiling నిర్ణయించడంలో అక్కడ ఇక్కడ ఉన్నటువంటి పరిస్థితులు class of land and kind of soil, యివన్నీ చూచి జరిగి 5,400/- రూపాయలుగా నిర్ణయమౌతుంది. ఆ నిర్ణయ

మైన మా వసతి permissible holding గా గుర్తించబడుతుంది. దీనికంటే ఎక్కువ భూమి ఉన్నవారు, ప్రకటింపబడిన తేదీకి 90 రోజుల లోపల Divisional Officer కు దరఖాస్తు ద్వారా చెప్పుకోవాలి. వారు తమ నికరాదాయం 5,400/- రూపాయలను మించకుండా ఉంటే కమీషన్‌వారు reasonable గా ఉందని చెప్పినచో మీకు land reforms వర్తించవని చీటీ ఇస్తారు. లేదా ఆయన విచారణ చేసి ఏ ఏ భూమి దానిలో surplus గా ఉంటోందో నిర్ణయించుకొని అది వారి యొక్క స్వాధీనంలోకి తీసుకోవడం జరుగుతుంది. ఈ లెఖ్ఖలు కట్టడంలో గత 3 సంవత్సరాల పంటలను లెఖ్ఖలోకి తీసుకుంటారు. ఆ లెఖ్ఖ ప్రకారం maximum holding కంటె ఎక్కువ ఉన్నదని నిర్ణయించిన భూమిని Regional Divisional Officer కు వదలిపెట్టాలి. ఆ భూమికి వారి ఆదాయాన్ని బట్టి నష్ట పరిహారం యివ్వబడుతుంది. మొదట schedule లో ఆ విషయాలు చెప్పాను.

మొట్టమొదటి 5,400/- రూపాయలకు free. రెండవ 5,400/- రూపాయలు కాని, అంతకు తక్కువ కాని, ఉన్న మామిని స్వాధీనం చేస్తే 10 రెట్లు, అంతకు పైన 5,400/- రూపాయలకు 8 రెట్లు, అంతకు పైన ఎంతయిచ్చినా దానికి 5 రెట్లు నష్ట పరిహారం యివ్వబడుతుంది. నేను ఈ అంకెలన్నీ ఉజ్జాయింపుగా చెబుతున్నాను. ఇప్పుడు wet acre కు నికరాదాయం 150/- రూపాయలు తేలిందనుకొంటే యిప్పటి maximum slab ప్రకారం 10 × 150 = 1500 పైగా, 5 × 150 = 750 కి క్రింద వస్తుంది. ఆ వ్యక్తి యొక్క holding ను బట్టి surplus land ను బట్టి ఈ మొత్తం యివ్వబడుతుంది. ఆ వ్యక్తికి వచ్చే net income ను బట్టి యిది మారుతూ ఉంటుంది.

ఇక్కడ ఉన్న ఒక్క కీలకం మీరు గుర్తించాలని కోరుతున్నాను. ఎవరైనా నష్ట పరిహారం ఎక్కువ పెట్టుకొనుటకు, per acre ఆదాయం ఎక్కువ చూపినచో, లేక మనం తెలిసికొన్నచో వారికి వచ్చే నష్టం ఏమిటంటే — quantum of acreage తగ్గుతుంది. అది తగ్గినట్లయితే quantum of average పెరుగుతుంది. అందుచేత self interest ఉంది కనుక అది mis-use చేయకుండా counter check వల్ల అది control అవుతుందనే భావంకూడా దీనిలో యిమిడి వున్నది. దానిలోని ఒక సెక్షనులో లిమిటెడ్ ఓనర్‌షిప్‌ను గురించి ఉన్నది. దాని ప్రకారం ఒకరికి వున్న భూమిని మరి ఎవ్వరూ అమ్మకొనటానికి వీలు వుండదు. ఆ భూమిని అమ్మే హక్కు ఎవ్వరికీ వుండక కేవలం వారసత్వపు హక్కుగా మాత్రమే వుంటుంది. కాంపెన్‌సేషన్‌ను, ఆదాయమును, గరిష్ఠపరిమితిని వారసులకు కూడా వర్తింపజేయాలని దానిలో వున్నది. భవిష్యత్తులో వుండే ఎక్విజిషన్ విషయములో—ఉదా చెప్పాలంటే—రూ॥ 5400 వుంటే దానిలో 2/3 వ మించి తీసికో

...ానికి వీలులేదు. అంటే రూ 3600 కు సరిపోయేటట్లుగా భవిష్యత్తులో భూమిని కొనుక్కోవచ్చు. అంతకు మించి కొనుక్కున్నట్లయితే ఆ భూమికి కంపెన్సేషన్ యివ్వకుండానే గవర్నమెంటు స్వాధీన పర్చుకోవచ్చునని దీనిలోవున్నది. తనకు తెలియకుండా, హఠాత్తుగా ఏదేశములో నున్న మేనమామో చనిపోయి 2 లక్షల విలువగు భూమి లభించినట్లయితే, ఆ భూమిని కూడా సీలింగ్ కు లోబడే తీసుకోవాలి కాని, ఆ భూమిని అంతా తీసికొనే హక్కు ఎవరికీ లేదు. దీనిలో మరియొక ప్రొవిజను కూడ వున్నది. గరిష్ఠ పరిమితిలో మూడవ వంతు భూమి-ఆ భూమిలో ఏ పంట పండించక, కేవలము పశుగ్రాసమునకై వున్న ఎడల-దానిని సీలింగ్ కు సంబంధము లేకయే వుంచుకొనవచ్చును. 10-6-1957 తేదీకి ముందు ఏ షుగర్ ఫ్యాక్టరీ క్రింద భూమి వున్నప్పటికి, అది సీలింగ్ క్రిందకు రాదు. ఆ తేదీ తరువాత వచ్చినదానికి ఈ సీలింగ్ వర్తిస్తుంది.

తెలంగాణాలో 'ప్రొటెక్టెడ్ టెనెన్ట్స్' అనే వ్యవస్థ ఒకటి వున్నది. దానికి సంబంధించిన ఒక సెక్షను యిలా వున్నది.

"At present, a protected tenant in the Telangana area is entitled subject to certain conditions to purchase from his landholder the lands under his occupation upto a maximum limit of 1 family holding. This limit will be removed so as to enable the protected tenants to purchase all the lands under his occupation except those reserved by the landholder for resumption for personal cultivation. This purchase will, however, be subject to the ceiling of future acquisition and surplus lands, if any, prevailing with the protected tenants will be taken over by the Government and the compensation payable will be apportioned between the landholder and the protected tenant in the proportion of 2 3."

ఇవి యిప్పుడు నేను ప్రవేశ పెట్టిన బిల్లులోని ప్రధాన అంశములు. హైదరాబాద్ పూర్వము చట్టముయొక్క, యిప్పుడు ప్రవేశ పెడుతున్న బిల్లుయొక్క స్వరూపమును నేను మనవి చేశాను. ఇక పూర్వపు హైదరాబాద్ చట్టమునకు, ఇప్పుడు ప్రవేశ పెడుతున్న బిల్లుకు వున్న వ్యత్యాసాలను, భేదాలను మనవి చేయదలచు కొన్నాను.

The level of ceiling in the Bill may be taken as roughly $1\frac{1}{2}$ times the level of ceiling in Hyderabad.

దీనివల్ల రూ 3600 వున్నది రూ 5400 అయినది. ఇది మొదటి వ్యత్యాసము. Extra joint family member కు వున్న తేడా మరియొకటి. రెండు చట్టాలలో

కూడా నికరాదాయము మొత్తము ఆదాయములో సగము వుండాలని నిర్ణయించటం జరిగింది. అయితే దానిలో ఒక తేడా యున్నది. పూర్వపు హైదరాబాదు ఆక్టులో అమలు జరిపిన రోజునాటి ధరలనే లెక్కలోనికి తీసుకోవాలని వున్నది. నేను ప్రవేశ పెట్టిన బిల్లులో గత 10 సంవత్సరములలోని సగటు ధరను లెక్కలోనికి తీసుకోవాలని వున్నది. హైదరాబాదు ఆక్టులో Joint Hindu family లో individual capacity లో out side the joint family hold చేసే property ని గురించి ఏమీ చెప్పలేదు. కాని నేటి బిల్లులో అది కూడా గరిష్ఠప్రమాణములోనే లెక్కలు తీసుకోవాలని చెప్పాము. హైదరాబాదు Land Commission వారు Various Categories ను చూశారు. Time వుంటే వాటిని గురించి చెప్పగలను. ఇప్పుడు చెప్పటానికి టైం లేకపోతే summary ని సైక్లోస్టైయిల్ చేయించి అందరికు circulate చేయించగలను. హైదరాబాదు ఆక్టులో family holdings ను local area ప్రకారం fix చేశారు. హైదరాబాదులోని 9 జిల్లాలలో కూడా ఆ యా ఏరియా లలోని లెక్కల ప్రకారం ఏవరేజిగా apply చేశారు. ఒక క్లాజు ప్రకారం 675 ఎకరాలు వున్నప్పటికి దానిపై ఆదాయము రూ 5400 వుండకపోతే ఆ ఎకరంగా వున్న వ్యక్తి R. D. O. కు పిటీషను పెట్టుకొని enquiry చేయించుకొన వచ్చును. హైదరాబాదు ఆక్టులో మరి యొక ముఖ్య మైన విషయము వున్నది. ఆ ఆక్టు ప్రకారం సీలింగ్‌లో వుండే భూమి అంతా తనంతట తానే వ్యవసాయము చేసుకునే భూమి (personally cultivated land) అయివుండాలి. మామంచా personal cultivation లో వుంటే ఏవిధంగా apply చేయాలి ? Exemptions ఏమిటనే విషయాలన్నీ నేను తీసుకురాదోయె Tenancy Act లో వస్తుంది కనుక యిప్పుడు ఆ issue ఈ బిల్లులో తీసుకురావటం జరుగలేదు. హైదరాబాదు ఆక్టులోని సీలింగ్ land holders కు Protected tenants కు మాత్రమే వుంటాయని ordinary tenants కు లేదు. ఇప్పుడు ప్రవేశపెట్టిన బిల్లులో ఆ తేడాలన్నిటిని తీసివేయటం జరిగింది.

"తెలంగాణాలో" స్వాధీనపు హక్కు అనేవి అమలులో లేవు. కనుక ఈ బిల్లులో usufructuous mortgages క్రింద ఫెయిర్‌రెంట్‌పు కాంపెన్‌సేషన్ ఎన్నిరెట్లు వుండాలో తెలుపబడింది. "Scale of compensation is directly related to the value of the land" అని దీనిలో వున్నది.

వారసత్వానికి సంబంధించిన విషయం హైదరాబాదు ఆక్టులో లేదు. హఠాత్తుగా వచ్చిన మామూలి లెక్కతీసిరానే విషయముకూడా దానిలో లేదు. గ్రేజింగ్ లాండు విషయము కూడా దానిలో లేదు.

ఇక మిగిలిన విషయాల గురించి కొంత చెప్పదలచుకున్నాను.

44వ సెక్షనును మనమంతా అంగీకరించాము. 38 E సెక్షన్ ప్రకారము హైదరాబాదులోని కొన్ని భూములు రాకపోవటం జరిగింది. ఆ చట్టంలో ఈ సెక్షన్ రాష్ట్రము అంతా అమలు పెట్టక ఖమ్మంమెట్టు జిల్లాలోను, ములుగు తాలూకా లోను పెట్టడం జరిగింది. ఆ రెండు ప్రాంతములలోను 13,000 మంది protected tenants వున్న సంగతి తెలిసింది. 98,000 converted dry acres of land వారి స్వాధీనములోనికి వెళ్ళింది. హైదరాబాదు చట్టమునకు, ఇప్పుడు ప్రవేశపెట్టిన బిల్లుకు వున్న వ్యత్యాసాలను చెప్పాను. ఇక భారతదేశములోని యితర రాష్ట్రములలో ఏమి జరుగుతున్నదీ స్వల్పంగా చెప్పదలచుకొన్నాను.

ఇంతవరకు వర్తమానంలో కమతాలకు ceiling పెట్టిన రాష్ట్రాలు యివి:—

అస్సాము—50 ఎకరాలు.

పెప్సు (ఇప్పుడు పంజాబులో చేరింది) 30 స్టాండర్డ్ ఎకరాలు.

Displaced persons అయితే 40 స్టాండర్డ్ ఎకరాలు.

పశ్చిమ బెంగాలు—25 ఎకరాలు;

హిమాచల్ ప్రదేశ్—చంబా జిల్లాలో 50 ఎకరాలు;

ఇతర చోట్ల 125 రూపాయలు పన్ను చెల్లించే భూమి.

జమ్మూ కాశ్మీర్—22 3/4 ఎకరాలు.

ఇదీ పరిస్థితి.

శ్రీమతి సి. అమ్మన్నరాజా (అత్తిలి):—దీనివల్ల idea సరిగా రావడం లేదు; Annual income యింత అని చెబితే బాగుంటుంది.

శ్రీ కె. వెంకటరావు:—ఆ విషయం తరువాత వస్తుంది. వాళ్ళు ఎకరాల లెక్కమీద వెళ్ళారు; income లెక్కమీద వెళ్ళలేదు; మనం income పెట్టుకుని ఎకరాల లెక్కలోనికి వెళుతున్నాము.

*Sri R. Lakshminarasimha Dora,* (Tekkali):—A standard acre in determined in terms of income also.

శ్రీ కె. వెంకటరావు:— Standard acre అనే దానిని ఒక్కొరాజ్యంలో ఒక్కొరకంగా ఏర్పాటు చేశారు. ఇలాంటి వాటికి కొన్ని పుస్తకాలు కూడా చదువు కోవాలి; లైబ్రరీనిండా ఉన్నాయి. A standard acre is one yielding a gross produce between............ ఒక విషయం rough గా చెబుతాను. మనం పెట్టినది యితర రాష్ట్రాలన్నింటిలో కంటె ఎక్కువే. అదే మీకు కావలసి వస్తే, పెట్టిన రాష్ట్రాలలో కూడా అంత లెక్కలో జరిగినవి కావు. అస్సాముకొండ రాష్ట్రం, పెప్సు ఒక పెద్ద రాష్ట్రంలో చిన్న భాగం. హిమాచల్ ప్రదేశ్‌లో

అసలు భూమి ఉన్నదో, లేదో చెప్పడం కష్టం. జమ్మూ కాశ్మీర్ కూడా కొండ ప్రదేశమే; భూమి తక్కువ. ఇక పశ్చిమ బెంగాలు మిగిలింది. అక్కడ 25 ఎకరాలు పెట్టారు. అక్కడ జరిగిన దెంతవరకు అన్నది కూడా రెండు నిమిషాలలో చెబుతాను. భవిష్యత్తులో యింతకంటె భూమి ఉండకూడదనే నిర్ణయాలు చేసిన రాష్ట్రాలు; బొంబాయి రాష్ట్రంలో 12 మొదలు 48 ఎకరాలవరకు పెట్టారు. సౌరాష్ట్రంలో యిపుడు బొంబాయి రాష్ట్రములో చేరింది-3 economic holdings, అంటే 60 మొదలు 120 ఎకరాల వరకు ఉంటుంది. మధ్య భారత్‌లో now in Madhya Pradesh 50 ఎకరాలు పెట్టారు. ఉత్తర ప్రదేశ్‌లో 30 ఎకరాలు. ఢిల్లీలో 30 standard acres పెట్టారు. ఈ ప్రకారంగా ఉన్నది. ceiling ఎంత ఉండాలనే విషయం చర్చించుకొనడంలో మరొక విషయం కూడా గుర్తుంచుకోవాలి. కేరళ రాష్ట్రంలో ఒక బిల్లు ప్రవేశ పెట్టారు. అది యింకా ప్యాసు కాలేదు. రెండు పంటలు పండే భూమి 15 ఎకరాలు, single crop paddy land అయితే 22 ఎకరాలు, తోటలు, coconut, pepper వగైరాలు అయినట్లయితే 15 ఎకరాలు అని అందులో పెట్టారు. కుష్కి అయినట్లయితే 30 ఎకరాలు అన్నారు. కుష్కి అంటే dry land; కరణంగారి లెక్కలలో ఉంటుంది తరి, కుష్కి అని. ఎప్పుడైనా ఒకసారి పుస్తకం చూస్తే తెలుస్తుంది. ఈ విషయమై కొన్ని కమిటీలు కూడా విచారించాయి. వారి అభిప్రాయాలు యిలా ఉన్నాయి.

సుబ్రహ్మణ్యం కమిటీ (మద్రాసు)

Land bearing an assessment of Rs. 200 for future acquisitions only.

లక్కరాజు సుబ్బారావు కమిటీ (ఆంధ్ర)

Land bearing an assessment of Rs. 250 or of an extent of 150 acres whichever is less for future acquisitions only.

జెట్టి కమిటీ (మైసూరు)

Land yielding an income of Rs. 5400 in the case of existing holdings and Rs. 3600 in the case of futur eacquisitions.

ORISSA LAND REFORMS COMMITTEE

Actual extents not recommended left to be determined by the State Government.

RAJASTHAN CEILINGS COMMITTEE

Between 40 and 250 acres in the case of dry lands depending upon the quality of the land and the nature of the tract. One-third of the above in the case of wet lands.

ఇవి ఇతర రాష్ట్రాలలో ఉన్న పరిస్థితులు. భారతదేశంలోనే కాక యితర దేశాలలో ఈ విషయమై ఏమైనా జరిగిందా? పోలెండ్, జెకోస్లోవేకియాలో maximum limit 125 ఎకరాలు అని పెట్టారు. యూగోస్లోవేకియాలో- under the latest law-25 ఎకరాలు; జర్మనీలో-U. S. zone-250 ఎకరాలు; ఈజిప్టులో 210 ఎకరాలు; జపాన్‌లోను, చైనా, ఫార్మోజాలలోను Land Distribution Programmes ఉన్నాయి కాని వివరాలు మనకు తెలియవు. అమెరికాలో బాధ లేదు; అక్కడ సీలింగులు లేవు. అమెరికా అంత గొప్ప వారైన తరువాత ఆలోచించు కుందాము. ఇంకా మనం చాలా క్రింద ఉన్నాము. వర్తమానం లోను, భవిష్యత్తులోను ceilings విషయమై ఇండియాలో శాసనాలు ఎలా ఉన్నాయో చెప్పాను. అవి ఎంతవరకు అమలు లోనికి వచ్చాయో కూడా చూడవలసి యున్నది. అస్సాములో కాంగ్రెసు జరిగిన తరువాత ఈ వ్యవహారాలు speedy గా జరగాలని pressure మొదలు పెట్టిన సంగతి అందరికి తెలుసును. మిగిలిన రాష్ట్రాలలో కూడా చర్యలు చేసుకుంటున్నారు. ఉత్తరాలు వస్తున్నాయి. అయితే యింతవరకు జరిగిన పని ఒక జమ్మూ-కాశ్మీరు రాష్ట్రంలోనే జరిగింది. మిగిలిన రాష్ట్రాలలో యింతవరకు చేసిన చట్టాలు అమలులోనికి రాలేదు. ఇపుడు చెప్పిన విషయాలు ఒక్క జమ్మూ కాశ్మీరు రాష్ట్రంలో మాత్రమే అమలు లోనికి వచ్చాయి. వివరాలు కావాలంటే చెబుతాను.

జమ్మూ-కాశ్మీర్‌లో— Four lakhs of acres of land have been taken over under the application of the scheme of ceilings.

పశ్చిమ బెంగాలులో— Rules have been framed. No lands have been taken.—

అంటే జమీందారీలకు apply చేసినది అన్న మాట.

పెప్సూలో— Declarations have been called for from the land holders but no lands have yet been taken over.

హిమాచల ప్రదేశ్‌లో—Have not so far been implemented.

ఇదీ పరిస్థితి. నిన్న telephone message ప్రకారం మా దగ్గర ఉన్న latest information ఇది. మద్రాసులో బిల్లునే పెట్టలేదు. యింకా, ఎవరు పెట్టినా పెట్టక పోయినా, నేను చెప్పిన అన్నికారణాలవల్ల మేము ధర్మం అనుకున్న దానిని పెట్టి తీరుతాము. మిగిలిన గొడవలు మనకు ఎందుకు? ఇవన్నీ చెబుతున్నానంటే వీటి నన్నింటిని దృష్టిలో పెట్టుకొని ఎలా చేసుకోవాలో నిర్ణయం చేసుకొనడానికే తప్ప వాటిని వీటిని చెప్పి దాటించుకుపోవాలని కాదు. ప్రభుత్వ ఉద్దేశ ప్రకారం ఇది

అమలులోనికి వచ్చి తీరుతుంది. మరొక విషయం కూడా చెప్పాలి. హైదరాబాద్ చట్టమును గురించి Economic effects of the land reforms in Hyderabad అని డాక్టర్ ఏ. ఎమ్. కుస్రూగారు 8 రూపాయలు ఖరీధు చేసే పెద్ద పుస్తకం వ్రాశారు. ఆయన యిక్కడ యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా ఉండేవారు. ఇపుడు ఇండియా గవర్నమెంటులో ఉన్నారు. మన చట్టంకూడా ఎట్లా అమలు జరుగుతున్నదో చూడాలికదా !

## ECONOMIC EFFECTS OF LAND REFORMS IN HYDERABAD

"A significant degree of evasion is noticeable in respect of tenancy legislation and the law regarding ceilings on land. Out of the originally created protected tenancy in 1951, 45 per cent remain in their status, 12 per cent became owner-cultivators, 2½ per cent have been legally evicted, 22 per cent have been illegally thrown out, 17 per cent voluntarily surrendered, 6 per cent still appear to be in the danger of being evicted."

ఇవన్నీ ఆయన అభిప్రాయాలు. ప్రభుత్వ అభిప్రాయాలు కావు.

"Implementation has been better in Diwana areas than in Jagirs. It has taken the form of purchase by transfer of about 1½ per cent making a change in the total ownership. 3½ per cent has been transferred in others names. Declaration of ceilings before implementation has been a tactical error."

తొలగించాలంటే కోర్టుకు వెళ్ళి పిటీషన్ పెట్టి తొలగించాలని ఉన్నది. అలా వెళ్ళకుండా private గా ఏదో చేసి, తొలగించిన వారన్నమాట. దౌర్జన్యమే అక్కర లేదు. ఏదో ఉన్నదికదా సామెత !

"Anyhow land reforms have resulted in some important changes in respect of evasions and defects in the implementation. The purpose of land reforms is to raise the production and it has been achieved to a certain extent. Investments among cultivators have risen faster in 5 years than among the non-cultivators. Investment among tenant cultivators, though low, has shown faster rate of cultivation. Borrowing by tenant cultivators is less than by owner-cultivators but has been put to better use."

ఈ అభిప్రాయాలను దృష్టిలో పెట్టుకొని మనము ముందు కార్యక్రమమును నడుపుకో వలసి ఉంటుంది. ఇంతవరకు ముఖ్య విషయములను గురించి నేను

క్లప్తంగా తెలియ జేశాను. వాటి దృష్ట్యా గరిష్ఠ పరిమితి ఎంత ఉండవలెనో మనము నిర్ణయించుకోవాలి. ఇంతకు ముందు హైదరాబాదు ప్రభుత్వం వారు అమలు జరిపిన శాసనం ఏవిధంగా అమలు జరిగినది, దాని ఫలితము లేమి అనే విషయములను కూడా మనము పరికింప వలసి యున్నది. First report of the Land Commission అనేది 200 పేజీల పుస్తకము. దానియొక్క సమ్మరీని రెండు పేజీలు వ్రాయించి సభ్యులందరకు అందజేయిస్తాను. ఆ రిపోర్టును చూసినట్లయితే ఏవిధంగా గ్రామాలకు వెళ్లి వివరాలు సేకరించడం జరిగినదో బోధపడుతుంది.

ఈ బిల్లు విషయంలో కొంతమంది మిత్రులకు కొన్ని అపోహలున్నాయి. అసలు యీ సీలింగ్ అనేది ఎందుకు? అని కొందరు భావిస్తున్నారు. ఈ బిల్లు అవసరాన్ని వ్యక్తంచేసే రెండు ముఖ్యకారణాలున్నాయి. వ్యవసాయాన్ని సమర్థవంతంగా జరిపే చడం మొదటి కారణం. సాంఘిక న్యాయాన్ని పెంపుచేయడం రెండవ కారణం. ఈ రెండు కారణములను బట్టి సీలింగ్ నిర్ణయించడం అభిలషణీయమని ఎంచబడు చున్నది. ఈ విషయములను గురించి విదేశములలో కూడా విచారణలు జరిగాయి. వాటి పర్యవసానంగా కొన్ని ముఖ్య విషయాలు ఋజువైనాయి. 'మరిన్ని కమతాలు ఉన్నట్లయితే ఎకరానికి వచ్చే ఆదాయం స్వల్పంగా ఉంటుంది. కమతం యొక్క విస్తీర్ణాన్నిబట్టి దిగుబడి హెచ్చు అవుతుంది' అనేవి యీ ముఖ్య విషయాలు. అయితే వ్యక్తి ఉకిన్న భూవసతి ఎక్కువ అవుతున్నకొద్దీ ఎకరానికివచ్చే అదాయంకూడా తగ్గుతున్నట్లు కూడా తేలింది. వెయ్యి ఎకరాలు, అయిదు వందల ఎకరాలు పెట్టుకొని వ్యవసాయంచేస్తూ వుండేవారికి హెచ్చు శ్రద్ధ ఉండనందువల్ల ఎకరానికి వచ్చే పంట తగ్గుతుందని ఋజువైంది. అంటువల్ల రెండు, రెండున్నర, మూడు ఎకరాల వంటి చిన్న కమతాలవల్ల, వెయ్యి, 5 వందల మంది పెద్ద కమతాలవల్ల ఉత్పత్తి తగ్గుతుంది కాబట్టి అభిలషణీయమైన ఒక ఆప్టిమమ్ సైజ్‌ను ఏర్పాటు చేయడం సాంఘిక న్యాయమని భావించటం జరిగింది. ఈ ముఖ్య ఆశయాన్ని మనస్సులో పెట్టుకొని భూవసతికి గరిష్ఠ పరిమితిని నిర్ణయించవలసి వుంది. భూమి అనేది దేశానికి సంబంధించినది. "All land belongs to Gopal" అని గాంధీగారు చెప్పారు. వారు చెప్పినదానికి మనమందరం అంగీకరించ వలసి ఉంది. దేశం లోని భూమి ఒక పరిమిత విస్తీర్ణము కలిగి వున్నది. దానిని ఎక్కువ చేయడానికి వీలులేదు. కొద్దిమంది చేతులలో ఎక్కువ భూమి కేంద్రీకృతం చేయడం అన్యాయం, తెలివితక్కువ. నా బుద్ధికి మంచిదని తోచిన, నేను న్యాయమని నమ్మిన, నా దేశానికి ఉపయోగం జరుగుతుందని నేను విశ్వసించిన విషయాలను సభవారికి యింతవరకు నేను తెలియ జేశాను. ఈ వివరాలన్నీ నేను వ్రాసుకొనినవే. నా మిత్రుడు కోదండ రామిరెడ్డిగారు వచ్చే ఒకటి, రెండు దినములలో నెల్లూరులోని భూస్వాముల సంఘమువారు తయారుచేసిన వివరాలను గురించి చెప్పవచ్చు.

మన దేశ జనాభాలో నూటికి 70 మందికి వ్యవసాయము జీవనాధారము. కాబట్టి ఆర్థిక వ్యవస్థలో ఎంతో వ్యత్యాసం కనబడుతున్నది. ప్లానింగ్ కమీషన్ వారు, సుబ్రహ్మణ్యం కమిటీవారు, లక్కరాజు సుబ్బారావు కమిటీవారు అందరు కూడా సిద్ధాంతరీత్యా వసతికి గరిష్ట పరిమితి నిర్ణయించాలని అంగీకరించారు. ప్లానర్స్, ప్రపంచములో ఉన్న పరిస్థితులు, మన దేశంలో ఉన్న పరిస్థితులు, సాంఘిక న్యాయం, అధిక ఉత్పత్తి ఆశయం అన్నీ కూడా భూ వసతికి గరిష్ఠ పరిమితిని పెట్టమని సూచిస్తున్నాయి. స్వార్థపరు లెవరైనా గరిష్ఠ పరిమితి అనవసరమని అనవచ్చు. అయితే కొందరికి ఒక అపోహ ఉన్నది. ఈ ఎకరాల మీద ఆదాయం ఎంత వస్తుంది అని, యింతకు ముందు శ్రీమతి అమ్మన్నరాజాగారు ప్రశ్నించారు. ఇన్ని ఎకరాల పరిమితి అని నిర్ణయించడం కష్టతరమైన విషయం. ఈ 5400 రూపాయ లనేది వ్యవసాయ ఆదాయానికి పరిమితి అని కొందరు భావిస్తున్నారు. అది యదార్థం కాదు. వ్యవసాయ ఆదాయానికి పరిమితి విషయం యీ బిల్లులో లేదు. గరిష్ఠ భూవసతిని నిర్ణయించడానికి 5400 రూపాయలు అనేది ఒక కొలబద్ద మాత్రమే. ఏ రకమైన మెరక భూమి ఎంత ఉండాలి, ఏ రకమైన పల్లపు భూమి ఎంత ఉండాలి అనేది మనం నిర్ణయించు కోవాలి. ఇంతకుముందు హైదరాబాద్ చట్టంలోని పద్ధతిని గురించి చెప్పాను. భూమి శిస్తును, ఫెయిర్ రేంట్‌గా చేసి, దానిని గుణించి ఆదాయాన్ని నిర్ణయించడం ఒక పద్ధతి. లేదా స్థూలంగా కేరళ బిల్లులోవలె 15 ఎకరాల రెండు పంటల భూమి, 22 1/2 ఎకరముల ఒక పంట భూమి, 5 ఎకరాల తోట భూమి 30 ఎకరముల మెట్టభూమి, అని నిర్ణయించడం వేరొక పద్ధతి. అయితే భూసారాన్ని బట్టి, ఫలసాయాన్ని బట్టి భూవసతి పరిమితిని నిర్ణయించడం సరియైన పద్ధతి. ఒక నిర్ణీత సమయానికి మాటవరసకు 1—1—1959 అనుకోండి. రు. 5400 లు అనేది యిందుకు కొలబద్ద.

"Ceiling based on an income of Rs. 5,400 is only a measuring rod to arrive at a ceiling acreage and that is the only way to determine the income from the wet acre and dry acre. This is to avoid the definition of a standard acre which is complicated and cannot be understood even by intelligent people"

కాబట్టి ఇది ఒక మెజరింగ్ రాడ్ తప్ప వేరొకటి కాదు. రేపు, 1-1-59 న యీ రూల్సు అన్నీ అప్లయి చేయటంవల్ల ఒకరికి 40 ఎకరాల భూమి వచ్చింది అనుకోండి. 40 ఎకరాల మీద రూ. 5,400 లు నికరాదాయం ఉంటుంది అనే భావంతో యీ 40 ఎకరాలు వదిలిపెట్టారు, అనుకోండి. రేపుప్రొద్దున యీ 40 ఎకరాలలో ఇన్‌టెన్సివ్ కల్టివేషన్ చేసి, అనేక రకాలుగ అభివృద్ధి చేసుకొని 20 వేల రూపాయలు ఎక్కువ ఆదాయం తెచ్చుకుంటారు. అందుచేత దానిని పది ఎకరాలకు తగ్గించరు. మొదట వంద ఎకరాలనుండి 40 ఎకరాలలోకి తీసుకువచ్చాము. ఆ మనిషి ఎక్కువ కృషి చేసి, అనేక రకాలైన పంటలు ఎక్కువగా పండించుకొని దేశంయొక్క

అభ్యుదయానికి తోడ్పడవలెననే ఉద్దేశంతోనే యీ ఆప్టిమమ్ లెవెల్ తీసుకొస్తున్నాము. Therefore, the income has more relationship to the progress of agriculture.

ఆయన ఆ భూమికో లక్ష రూపాయల ఆదాయము తెచ్చుకోగలిగితే మరీ మంచిది. అందువల్ల ఇది సీలింగ్ ఆన్ ఎగ్రికల్చరల్ ఇన్‌కమ్ కాదు. ఇది సీలింగ్ ఆన్ ఎగ్రికల్చరల్ ఇన్‌కమ్ అని పొరపాటు పడవద్దు. It is only a measuring rod to arrive at the acreage. ఎంత విస్తీర్ణమైన భూమి, ఏ రకమైన తరహాలో ఎవరికి ఎలా ఉండాలనే నిర్ణయంకోసం వినియోగించే టటువంటి కొలబద్ద కాని ఇంకొకటి కాదు అని నేను మనవిచేస్తున్నాను.

ఇంకొక ముఖ్యమైన విషయము— భూమిని మేల్కొలపాలి. అంటే తక్కువ పంట పండే భూమిలో ఎక్కువ పంట పండేటట్లు ఇంటెన్సిఫై చేయాలి. దానిమీద వ్యవసాయం చేసే మనిషిని కూడా మేల్కొలపాలి. "నీవు ఇంకా ఎక్కువ శ్రమపడి పంట ఎక్కువ పండించాలి. అప్పుడే మనదేశంలో సరిగా ఆహారాలు జరుగుతాయి" అని రైతుకు తెల్పాలి. ఇందుకు నిర్ణయాలు తీసుకోవటంలో, మనము భయం అన్నది మనస్సులోంచి పోగొట్టుకొని, దీనిని ముందుకు తీసుకువెళ్లవలసిన న్యాయము ఉన్నది. అసలు, మనదేశం మొత్తంమీద ఆహార కొరత ఉన్నది. ఇప్పటి వ్యవసాయ వ్యవస్థ మారితేగాని, మనదేశంలోగల ఆహార కొరత తీర్చటం సాధ్యం కాదు. నేటి ప్రపంచ జనాభా నిత్యం దినదినాభివృద్ధి పొందుతున్నది. ప్రపంచంలో ప్రతి సెకండ్‌కు ఇద్దరు పిల్లలు పుడుతున్నారని ఎవరో లెక్క వేశారు. మన దేశంలో ప్రతి సెకండ్‌కు ముగ్గురు పుడుతున్నారేమో, నాకు తెలియదు. కాబట్టి ప్రస్తుతపు జనాభా అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని మనము యీ వ్యవహారము చేయవలసి ఉంటుంది. మనము ఇంకో విషయం గుర్తించాలి. "భూమికావాలి" అనే కోరిక రైతులకు ఉన్నది. అందులో భూమే కాదు. 'తమదన్నటువంటి భూమి' కావాలి అన్న కోరిక కూడా ఉన్నది. He wants to own it. అనే విషయం కూడా మనం గుర్తించాలి. ఒక ఆయన వ్రాశాడు— The hunger for land is like that for water by a desert-traveller nearing oasis. ఒక మనిషి బాగా ఎండలో దెబ్బతిని, మిక్కిలి దాహంతో, పెద్ద ఎడారిలో ఉన్నటువంటి మంచి అందమైన ఒయాసిస్ దగ్గరగా వెడుతున్నాడు. అతనికి ఒయాసిస్ ఎదురుగా కనిపిస్తున్నది. అలాంటి వ్యక్తికి దాహంఎంత ఉంటుందో, తన స్వంతభూమి కావాలనే కోరిక దేశంలో అంత ప్రబలంగా ఉందని చెప్పారు. ఈ దేశంలో యీ దాహాన్ని తీర్చటం అసంభవమైన విషయం. ఇంకా అందుకు మనం చర్య తీసుకోవలసి ఉన్నది. ఈ భూసంస్కరణలే కాకుండా, ఇంకా ఇతర సంస్కరణలు కూడా దేశంలో తీసుకువచ్చి, జాతీయ ఆదాయాన్ని, ఆర్థిక ప్రమాణాన్ని అభివృద్ధిలోకి తీసుకురావల్సిఉంది. దీనికోసం

మన ప్లాను ఉన్నది, ఆ ప్లానులో "అనేక కేటగిరీస్‌లో, ఎలా ఎలా పనిచేస్తే, ఆదాయం మనిషికి ఎలా ఎక్కువై, ఎంప్లాయిమెంట్‌ వచ్చి దేశం అభివృద్ధి చెందుతుందో" ఉంటుంది. కాబట్టి ఏవేవో చెబితే బాగుంటుంది, అని అను కొనేవారికి, కావాలంటే, ఆ పుస్తకం నేను ప్రజెంట్ చేస్తాను. ఆ పుస్తకము చదువుమని కోరుతున్నాను. అప్పుడే యీ భూసమస్య తీరుతుంది. ఈ గొడ్డలి, నాగలి వెనకాల ఉన్న మనిషికే స్తోమత వస్తుంది. ఈ వ్యక్తి అను శతాబ్దాలనుంచి జరిగిన అన్యాయాల వల్ల, బరువు వల్ల కృంగి కృశించిపోయి, వంగిపోయి గూనిమనిషి అయిపోయాడు అని మార్క్సహం వ్రాశారు. అంచేత మనం అతిడు నిటారుగా నిలుచునే శక్తి యివ్వాలి. అతనికి నమ్మకంతోటి, ధైర్యం తోటి యీ సమస్యలను ఎదుర్కొనే భావాన్ని కలిగించి, మన దేశాన్ని, స్వతంత్ర భారతాన్ని, గాంధేయ పద్ధతితోటి, నెహ్రూగారి నాయకత్వం క్రింద యివ్వబడినటు వంటి మన ప్రణాళికలతో యీ ప్రబలమైన సమస్యలను మనము పరిష్కారము చేసుకోవాలి.

వ్యవసాయ క్షేత్రంలో ప్రధానమైన పేరు ప్రతిష్టలు సంపాదించుకొన్న మన ఆంధ్రప్రదేశ్ ఉన్నంత "per . cre yyleid" (ఒక ఎకరంలో పండే పంట) మన దేశంలో మరెక్కడా లేదు. అంత ఎక్కువగా మన రాష్ట్రంలో పంట పండుతుంది. సీలింగ్ పెట్టి, ఇంకా ఇన్‌టెన్సిఫై చేసి, డబుల్ చేసి పైకి, తీసుకువెళ్ళేదానికి అనువైన పరపతి, సర్వీసు, కో-ఆపరేషన్ జతపర్చి ముందుకు తీసుకువెళ్ళవలసి ఉన్నది. అట్టి వివిధమైన కార్యక్రమాలకు యిది ఒక సోపానము, దీనికి సంబం దించిన ఇంకా తొమ్మిది విషయాలు తమ ముందుకు తీసుకువచ్చి, సభ్యుల ఆమోదం పొంది. ఒక సంవత్సరకాలంలో వీటన్నింటిని శాసనబద్ధం చేసే యత్నంలో గౌరవ సభ్యులు అందరూ తోడ్పడతారని నేను ఆశిస్తున్నాను. నేను దాదాపు గంటన్నర కాలం తీసుకొని, ఇవాళ ఉన్న పరిస్థితులన్నీ తమ ముందర పెట్టాను. దీనిపై వచ్చిన విమర్శలకు జవాబు చెప్పటానికి నేను యత్నము చేయలేదు. ఇవాళ, రేపు, ఎల్లుండి గౌరవసభ్యులు చెప్పే విషయాలన్నీ నోటు చేసుకొని, ఎల్లుండి వాటన్నింటికి సమాధానం చెబుతాను బయట పత్రికలు, అసోసియేషన్స్, యింకా ఇతరులు చేసిన విమర్శలు మనసులో పెట్టుకొని సమగ్రంగా సభ్యులకు సమాధానం చెప్పుకొం టాను. ఇంకా ఏమైనా తేడాలుగాని. మార్పులుగాని ఉంటే, సెలక్టు కమిటీలో చూసుకోవచ్చును. ఈ బిల్లును జాయింటు సెలక్టు కమిటీకి పంపించే, విషయంలో సభ్యులందరు ఏకగ్రీవంగా ఆమోదిస్తారని ఆశిస్తూ, యీ సెలక్టు కమిటీ మోషన్‌ను సభవారి యెదుట పెడుతున్నాను. అధ్యక్షులవారి సెలవుతోటి నా ఉపన్యాసాన్ని ముగిస్తున్నాను.

శ్రీ యం. నాగిరెడ్డి (మాచర్ల):—అన్ ఎ పాయింట్ ఆఫ్ క్లారిఫికేషన్ సర్, ఈ బిల్లులో 5,400 రూపాయలు నికరాదాయం అని, ఐదుగురికి మించిఉంటే,

ప్రతి ఒక్కరికి 1,200 రూపాయయి అని అన్నారు. ఐదుగురుకి తక్కువ ఉన్నటువంటి కుటుంబంలో యిద్దరి ముగ్గురి పేర ఆస్తి ఉంటే, ఆ ఆస్తి అంతా లెక్క తీసుకొని, 5,400 రూపాయలు నికరాదాయం పెట్టే ఉద్దేశమా, ప్రభుత్వానికి? "అట్లాతీసుకొంటాము" అనిగాని, లేదా "అట్లా లెక్క కట్టము, ఎవరిది వారికే లెక్క గడతాము" అనిగాని స్పెసిఫిక్‌గా యీ బిల్లులో ఎక్కడా లేదు. దాన్ని గురించి మంత్రిగారి అభిప్రాయమేమిటో సెలవిస్తారా?

శ్రీ కె. వెంకటరావు:—బిల్లులో అంతా స్పష్టంగా కనిపిస్తున్నది. ఒక కుటుంబంలో జాయింటు సభ్యునిక్రింద, మితాక్షర 'లా' క్రింద, స్త్రీ ధనం క్రింద, విడిగా ఉన్నటువంటి వారందరికీ కూడ ఒక్కొక్క సీలింగ్ వస్తుంది. ఇవాళ తండ్రి కొడుకులు ఇద్దరు ఉండొచ్చు. జన్మమంతా తండ్రి కొడుకులు ఒకటి అవరు. ఈ కొడుకులు ఆస్తి పంచుకొనే హక్కు మన మితాక్షర 'లా' యిచ్చింది. ఇవాళ మనం ఆ 'లా' ఎబ్రొగేట్ చేయలేదు. అది ఎంతకాలం అమలులో ఉంటుందో అంత కాలం మన దేశంలో ఉన్నటువంటి ప్రతివ్యక్తికీ యీ సీలింగ్‌కు లోబడి భూమి వస్తుంది

శ్రీ కె. జనార్ధనరెడ్డి:—ఈ బిల్లు చాలా ముఖ్యమైనది గనుక, మాట్లాడదలచుకొన్న గౌరవసభ్యులందరకు అవకాశం యిస్తూ, ప్రతి సభ్యునికి సమానమైన టైము ఇవ్వవలసిందిగా సూచన చేస్తున్నాను.

ఒక గౌరవసభ్యుడు:—అధ్యక్షా, ఒక మంత్రిగారు చెబుతూ భవిష్యత్తులో 3,600 రూపాయల వరకు కొనుక్కోవచ్చును అని అన్నారు. అయితే 3,600 రూపాయల వరకు కొనుక్కోవచ్చునంటే, 5,400 రూపాయలు ఆదాయం వచ్చినంతవరకు సీలింగ్ వచ్చిన తర్వాత, పైన 3,600 రూపాయల వరకు మాత్రా కొనుక్కోవచ్చా అంది? ఆవిధంగా ఒక పత్రికలో వ్రాసి ఉన్నదండి.

శ్రీ కె. వెంకటరావు:—అది చాలా తప్పు అయిన విషయము. 5,400 రూపాయల పైన రెండు రూపాయలది కొనుక్కున్నా గవర్నమెంటువారు కాంపెన్‌సేషన్ యివ్వకుండా తీసుకొంటారు. ఇవాళ 5,400 రూపాయలు భూమికి లోపుగాని, లేదా 3,600 రూపాయల లోపు ఆదాయం వచ్చేవారు 3,600 రూపాయల ఆదాయం వచ్చేదాకా కొనుక్కోవాలని అర్థంకాని ఇంకో అర్థంకాదు.

శ్రీ యం. సత్యనారాయణరాజు (చీపురుపల్లి-జనరల్):—అధ్యక్షా, Standard acre అనేది ఒక్కొక్క State లో ఒక్కొక్క మాదిరిగ ఉంటుందన్నారు. అలాగైతే మన ఆంధ్రప్రదేశ్ State లో Standard acre అంటే ఏ విధముగ ఉంటుంది? దానియొక్క పరిమితి ఎంతో చెబుతారా?

*Sri M. Nagi Redy, (Macherla)*:— Mr. Speaker, Sir. I beg to move:

"That the Bill be referred to a Select Committee".

*Mr. Deputy Speaker*:— Motion moved.

*Sri Vavilala Gopala Krishnayya* (Sattenapalli):—Sir, I beg to move:

"Add the following at the end of the Motion of the hon. Minister for Revenue referring the Bill to a Joint Select Committee:

'With a direction of making the Ceiling limit to Rs. 3,600 per annum'."

*Mr. Deputy Speaker*:— Motion moved.

*Sri K. Venkata Rao*:—Sir, is the amendment of hon. Sri Vavilala Gopalakrishnayya in order?

*Mr. Deputy Speaker*:— It is in order under Rule 105 of the Assembly Rules. It is not an amendment, but it is a Motion.

డాక్టర్. యం. చెన్నారెడ్డి (వికారాబాదు—జనరల్):—అధ్యక్షా. గత పర్యాయము ఈ బిల్లు మన పూర్వపు హైదరాబాదు State లో ఉన్నటువంటి Land Reforms Bill కు సంబంధించి, ముఖ్యమైన మార్పును తెస్తున్నది గనుక దీనిని Regional Committee లో చర్చించటానికి అవకాశము యివ్వాలనీ, అది అవసర మనీ నేను అధ్యక్షులవారి దృష్టికి తెచ్చినప్పుడు, ఈ విషయమును గురించి నిర్ణయము చేస్తామని చెప్పారు. కాబట్టి యిప్పుడు ఈ విషయమును గురించి మీకు జ్ఞాపకము చేస్తున్నాను. దీనిని గురించి Regional Committee లో చర్చించే అవకాశము యిస్తే ఇందులో కూడా తగిన మార్పులు చేయవచ్చు. ముఖ్యంగా వ్యవసాయమునకు, Co-operation కు సంబంధించినవి పరిశీలించకపోతే, తెలంగాణా ప్రజలకు దెబ్బ తగులుతుంది గనుక, యీ బిల్లును Regional Committee లో కూడా చర్చించటానికి అవకాశము యివ్వాలని కోరుతున్నాను.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్:—ఈ విషయమును గురించి రేపు సరియైన సమాధానము చెప్పబడును. సుందరయ్యగారు ఈ బిల్లును గురించి తమ అభిప్రాయము కూడా తెలియజేస్తారు. ఈలోగా ఎవరైనా సభ్యులు మాట్లాడదలచుకున్న వారు ఉంటే, వారివారి పేర్లు వ్రాతమూలముగ వారి పార్టీ whips ద్వారా నాకు అందజేస్తే, ఉపన్యాసములకు adjust చేయటానికి వీలు అవుతుంది.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం):—అధ్యక్షా, రెవిన్యూ మంత్రి కళా వెంకటరావుగారు భూసంస్కరణల బిల్లును యిక్కడ సభవారియెదుట ప్రవేశ పెట్టినారు.

శ్రీ జి. లచ్చన్న (సోంపేట):—Party whips తో సంబంధము లేనటు వంటి సభ్యులు ఉన్నప్పుడు, వారుకూడ పేర్లను తెలియజేయటానికి అవకాశము ఉంటుందా?

మిస్టర్ డిప్యూటీ స్పీకర్:—అలాంటివారు డైరెక్టుగా నాకు పంపవచ్చు. party whip ఉన్నపార్టీవారు, whip ద్వారా తెలియపర్చాలని కోరుతున్నాను.

శ్రీ పి. సుందరయ్య:—రెవిన్యూమంత్రిగారు ఈ బిల్లును గురించి వివరాలు చెబుతూ మధ్యమధ్య కాంగ్రెసు బెంచీల వైపుకు తిరిగి మాట్లాడారు. ఎందువల్ల ఆ విధముగ మాట్లాడుతున్నారని అడిగితే, 'వినని వారికి ఎట్లాగు లేదు. వినే వారికైనా కొంచెము చెబితే, అది వారికి బాగా ఉపయోగముగ ఉంటుందని ఆ విధముగ మాట్లాడానని' అన్నారు. అందులో ఉన్న అసలు సంగతి కాస్తా బైటకు వచ్చేస్తున్నది.

శ్రీ కె. వెంకటరావు:—బైటికి ఏమి వచ్చింది?

శ్రీ పి. సుందరయ్య:—ఇందులో బైటికి వచ్చిన అసలు విషయము ఏమిటంటే, మేము ప్రవేశపెట్టిన బిల్లు వల్ల నిజముగా ప్రమాదములేదు. భూస్వామికి కూడ ఏలాంటి ప్రమాదము ఉండదు. ఎవ్వరికిగాని ఒక సెంటు భూమి అయినా పోదు. పత్రికలలో ప్రకటనచేసినట్లు భూమి ఆదాయము మీద యీ సీలింగు పెట్టినట్లయితే ఒక లక్ష ఎకరములకంటే ఎక్కువ మిగలదు. అందువల్ల ఎవరూ భూములు పోతాయని భయపడవలసిన అవసరము లేదు. ఇతర ఆదాయ ముల మీద సీలింగు పెట్టడము లేదని, భూమిని పంచడము లేదని ప్రజలు దుమ్మెత్తి పోస్తున్నారు. అందువల్ల యీ బిల్లును యీ విధంగా తెచ్చాము గనుక, దీనిని యిట్లాగే ప్యాసు చేయండి. ఇది ఏదో మునిగిపోతుందని అనుకోకండి, అని అర్థము వచ్చేటట్లు మాట్లాడారు. కాంగ్రెసు పార్టీలోని కొంతమంది యీ సీలింగు చాలదని, కొంత మంది అసలు సీలింగు ఎందుకని అంటున్నారు. అలాంటి వారిని సంతృప్తి పరచటానికి ఉపన్యాసము చేశారు. మంత్రిగారు యిక్కడ ఉపన్యాసము చేయడము చూస్తే ప్రధానంగా అలాంటి వారికి నచ్చ జెప్ప టానికి ప్రయత్నిస్తున్నట్లుగా కనబడుతున్నదే కాని, మరేమి కన్పించడము లేదు. కాని యీ నాడు గ్రామములలోని వాస్తవిక పరిస్థితులనుబట్టి చూస్తే యీ బిల్లు శుద్ధ పనికి మాలిన రీతిగాను, నిరర్థకముగాను ఉన్నది. అక్కడ ఉన్న కమిటీలు

కానివ్వండి, Planning Commission యొక్క ఉద్దేశ్యము కానివ్వండి, ప్రజల ఉద్దేశ్యము కానివ్వండి, వ్యవసాయాభివృద్ధి కానివ్వండి, జాతీయ పునర్నిర్మాణము కానివ్వండి, ఈ బిల్లు దేనికిగూడ పనికిరానటువంటి రీతిగా ఉన్నది. వాటికి పనికివచ్చే విధముగ ఈ భూసంస్కరణల బిల్లును తీసుకుని వచ్చినట్లయితే ఉపయోగ కరముగ ఉండేది. ఇది ప్రధానమైన విషయముగ భావించి బిల్లును తేవలసింది. భూ సంస్కరణల యొక్క ఉద్దేశ్యము మంత్రిగారు చెప్పారు. అందులో మొదటిది వ్యవసాయాభివృద్ధి అని, రెండవది సాంఘిక న్యాయమని అన్నారు. నిజమే. General గా మాట్లాడితే నేను వారితో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. వ్యవసాయాభివృద్ధి, పారిశ్రామికాభివృద్ధి, జాతీయ పునర్నిర్మాణము, యివి అన్నీ ఒక దానితో ఒకటి ముడిపడి ఉన్నవి తప్ప యింకొకటి ఏమీ లేదు. కాని యీనాడు ప్రభుత్వం తెచ్చిన యీ సీలింగుబిల్లు వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుతుందా? వ్యవసాయాభివృద్ధి లేనిదే పారిశ్రామికాభివృద్ధి ఎట్లా అవుతుందని అందరు అంగీకరిస్తారు. పారిశ్రామికాభివృద్ధి, జాతీయ పునర్నిర్మాణము, తద్వారా సాంఘిక న్యాయము ఏమైనా జరుగుతుందా, అంటే, కానే కాదు అని చెప్పాలి. ఈ నాటి దేశపరిస్థితులను బట్టి వ్యవసాయము అభివృద్ధి చెందాలని అంటే, భూమి మీద కష్టపడి పనిచేసేవాడు, 'ఈ భూమి నాది, నా కాయ కష్టమువల్ల నేను శ్రమకోర్చి పండించిన ఫలితమువల్ల నేను అనుభవించగలను. నేను ఒక బస్తా ధాన్యం అదనంగా పండిస్తే, అది మాగాణేకాదు, ఒక ఎకరము మెట్ట భూమిలో యింకా పదిశేర్ల జొన్నలు అధికముగ పండిస్తే, దానిపైన యింకా రెండవ పంటను వేస్తే, మూడవపంట కూడ వేస్తే, ఎండ అనక, వాన అనక, గ్రామము అంతా తిరిగి, పేడ పోగుచేసి, ఎరువులు పోగుచేసి, ఆ భూమిమీద వేసి ఎక్కువగ పండిస్తే, ఆదాయము మరికాస్త పెరుగుతుంది. నా కుటుంబము లోనివారు మరికా- గంజినీరు త్రాగటానికి వీలు అవుతుంది. నా బిడ్డలు బడికిపోయి చదువుకోటానికి వీలు అవుతుంది. ఇప్పుడు నా బిడ్డలకు 8 ఏండ్ల వయస్సు రాగానే, 10 ఏండ్ల వయస్సు రాగానే ఏ ఆసామి వద్దకో, ఏ భూస్వామి వద్దకో పంపిస్తూ, చదువు లేకుండా తర తరాలుగా కష్టజీవితము గడుపుతుంటూ ఉన్నాను. అలాంటి జీవితమునుంచి ఒక అడుగు అయినా ముందుకు పోవాలని ఆశించేవారికి యిది నా శ్రమ, యిది నా కష్టము, యిది తీరిపోయింది' అని అనుకొనే ఆశ అయినా కల్పించటానికి వీలుగా యీ భూసంస్కరణలను ప్రవేశపెట్ట వలసినది. అయితే ఈ రోజులలో గ్రామాలలో ఉన్న పార్టీల పరిస్థితి ఏమిటి? మన దేశములో 1951, 1956 వ సంవత్సరములలో తయారు చేసిన Census లెక్కలను బట్టి All India Agricultural Labour Wages Enquiry Committee వారు లెక్కలు తయారు చేశారు. ఆ లెక్కలు వారు తయారు చేసిన రిపోర్టులో ఉన్నవి. ఆ రిపోర్టును పరిశీలిస్తే, వాస్తవిక పరిస్థితులు తెలియగలవు. వ్యవసాయ జనాభాను

గురించిన Census లెక్కలు చూస్తే నూటికి యాభై మంది దాకాను, వ్యవసాయ కార్మిక దృష్టితో చూస్తే నూటికి 57 మంది ఉన్నట్లుగా వారి నివేదికలో తెలియ జేశారు. కొద్దో గొప్పో భూమి ఉంటేగాని, భూమి అసలే లేనటువంటి వ్యవసాయ కార్మికులకు యితర ఆదాయములు కొద్ది కొద్దిగా వస్తున్నప్పటికినీ, ఆ కుటుంబాలు కూలిపని చేసుకుంటూ ఉన్నవారు, కేవలము కూలి మీదనే ఆధారపడి జీవిస్తూ ఉన్న వారు, వ్యవసాయ జనాభాలో నూటికి 57 మంది ఉన్నారని ఆ కమిటీవారి రిపోర్టులో వ్రాయబడినది. Census లెక్కలలో భూమి లేనటువంటి వ్యవసాయ కార్మికులు మాత్రమే ఎంతమంది ఉన్నారని చూస్తే నూటికి ఏ 27 మందో, 30 మందో కన్పించవచ్చు. భూమి లేనటువంటి కౌలుదార్ల సంఖ్యతో వీరిని కలుపవలసి ఉన్నది. అదే విధముగ అయిదవ తరగతికి చెందిన వారు, 8 వ తరగతికి చెందినవారు ఉంటున్నారు. వారిలో కొంతమంది కట్టెలు కొట్టుపని జీవించేవారు, ఇళ్ళలో ఊడిగము చేసేవారు, మట్టితోలేవారు, ఇటుకలు తయారు చేసేవారు, పెంకులు తయారు చేసేవారు, కావడి మోసేవారు, ఎడ్లుదంచే వారు, పాలు పెరుగు తయారు చేసుకొని అమ్ముకునేవారు, మేకలు పెంచేవారు, యిలాంటి వృత్తుల వారందరు వ్యవసాయ రంగము లోనివారే. ఇలాంటి వారందరినీ వాళ్ళతో కలిపి లెక్క వేస్తే, ప్రతి కార్మికునికి సంబం ధించిన census లెక్కలు మన వద్ద ఉన్నవి. కనుక నూటికి యాభై మంది కేవలము కూలియే ప్రధాన జీవనముగ ఉన్నవారని ఆ లెక్కల వల్ల తెలుస్తున్నది. ప్రతి కుటుంబానికి లెక్కలు వివరముగాను వ్యవసాయ కార్మికులను గురించిన నివేదిక దృష్టిలో ఉంచుకొని చూస్తే నూటికి 57 మంది దాకా ఉన్నారు. కోస్తాజిల్లాలలో, తెలంగాణాలో, రాయలసీమలో అన్ని చోట్లలోను ఉన్నవారు నూటికి 57 మందిదాకా ఉన్నారు. బహుశ ఏ ఒక పెరసెంటో రెండు పెరసెంటో యిటో అటో హెచ్చుగానో, తక్కువగానో ఉండవచ్చు. కాని ఈ మూడు ప్రాంతాలలోనూ వేరే వేరే లెక్కలు ఉన్నవి. అవి చూచినప్పటి కినీ ఆ Labour Wages Enquiry Committee వారు తయారు చేసిన లెక్కలు కోస్తా జిల్లాలలో 20 గ్రామాలు, రాయలసీమలో 10 గ్రామాలు, తెలంగా ణాలో 15 గ్రామాలు లెక్కలోకి తీసుకుని ఈ జనాభా యొక్క సంఖ్యను ఉజ్జాయిం పుగా తయారు చేసినట్లుగా మనకు కనిపిస్తున్నది.

Agricultur l Enquiry Report ప్రకారం నూటికి కోస్తా జిల్లాలలో 57, రాయలసీమ జిల్లాలలో 57, తెలంగాణాలో 56 మంది, census లెక్కల ప్రకారం కోస్తా జిల్లాలలో నూటికి 53, రామలసీమ జిల్లాలలో 100 కి-43, తెలంగాణాలో 100కి 52 1/2 చొప్పున వ్యవసాయ కార్మికుల క్రింద లెక్క వేయవలసి ఉంటుంది. అయితే వీరిదగ్గర కొద్దిగానో, గొప్పగానో, భూమి ఉండవచ్చు. అయితే ఈ భూమి ఎంత ఉన్నది? వీరికి ఆదాయం ఏరీతిగా వస్తున్నది? అనే దానిని గురించి Agricultur-l W.ges Committee వారి report వచ్చినది. ఏదో ఆసామి క్రింద పాలేర్లుగా

ఉన్నటువంటి వాళ్ళు వ్యవసాయ కార్మికులు 100 కి, 2, 3 కన్న ఎక్కువ లేరు. వీళ్ళకు మాత్రం 320 రోజులు 330 రోజులు పని ఉన్నది. వాళ్ళను మినహాయించితే మిగిలిన కార్మికులకు ఎప్పుడు పని పడితే అప్పుడు పిలిచేటటువంటి వాళ్ళకు ఎన్ని రోజులు పని దొరుకుతోంది. ఆంధ్ర ప్రాంతంలో-కోస్తా జిల్లాలోను, రాయలసీమ జిల్లాలోను-సగటున చూసినట్లయితే 150 రోజులకు మించి పని దొరకటం లేదు. వ్యవసాయ కార్మికుల జనాభాకు పాలేర్లను కూడా కలుపుకొని చూసినట్లయితే 160 రోజులకన్న ఎక్కువ పని దొరకటం లేదు. పని దొరికినట్లయితే 330 రోజులు, 340 రోజులు కూడా పనిచేసేదానికి తయారుగా ఉన్నారు. 60 రోజులు సెలవల క్రింద తీసేసినా మిగతా 300 రోజులు పని దొరక వలసి ఉంటే 160 రోజులు మాత్రమే పని దొరుకుతోంది. ఎప్పుడు కూలి దొరికితే అప్పుడు వెళ్ళేటటువంటి వారికి (casual labour) 150 రోజులు మాత్రమే పని దొరుకుతోంది. తెలంగాణా లెక్కలు చూచి నట్లయితే 123 రోజులకన్న ఎక్కువ దొరకటం లేదు. వీటిని దృష్టిలో పెట్టుకొన్నప్పుడు 300 రోజులూ పనిచేసే తాహతు కలిగి నటువంటి కుటుంబం 150 రోజులకన్న ఎక్కువ పని లేకుండా, కొన్ని స్థలాలలో 123 రోజుల కన్నా ఎక్కువ పని లేకుండా నిరుద్యోగులుగా ఉంటున్నారు. వీళ్ళకు పని కల్పించే టటువంటి మార్గం ఏమిటి? వీళ్ళకు తిండి పెట్టే టటువంటి మార్గం ఎట్లా? అనేది మనం చూడాల్సి ఉన్నది. Agricultural Wages నివేదిక యింకో సంగతికూడా తెలియ జేస్తున్నది. కుటుంబానికి సగటున చూసుకున్నప్పుడు, adults క్రింద యిద్దరు బిడ్డలను ఒక పెద్ద మనిషిక్రింద లెక్క వేసుకుని-చూచినట్లయితే, రాయల సీమ జిల్లాలో నలుగురు, కోస్తా జిల్లాలో ముగ్గురు, తెలంగాణా జిల్లాలో 4 1/2, 5 దాకా ఉంటారు. ఈ విధంగా కుటుంబంలోని పురుషుడు, స్త్రీ, బిడ్డలు, పని చేసినప్ప టికి కోస్తా జిల్లాలో వాళ్ళు సంపాదించ గలిగింది సంవత్సరానికి 323 రూపాయలకన్న ఎక్కువ లేదు. తలకి consumption unit గాని చూచి నట్లయితే సంవత్సరానికి 110 రూపాయల కన్న ఎక్కువ రావడం లేదు. రాయలసీమ జిల్లాలో నలుగురు పెద్ద వాళ్ళుగానే వేసుకున్నట్లయితే ఆ కుటుంబం 406 రూపాయలు మాత్రమే సంపా దిస్తున్నది. తలకు 100 రూపాయల కన్న ఎక్కువ సంవత్సరానికి రావడం లేదు. తెలంగాణాలో 123 రోజులే కూలిపని దొరికే టటువంటి వాళ్ళకు యింతకన్నా తక్కువే రావాల్సి ఉంటుంది. మెట్టభూమి ఏదైనా ఉండి సాగు చేసుకుంటే దాని మీద ఏమైనా కొంచెం అదనంగా వస్తేరావచ్చు. ఏమైనప్పటికి వారికి కూడా తలకు 100 కు మించి సంవత్సరానికి రావడంలేదు. ఏజన్సీ ప్రాంతాలలో చూస్తే 240 రూపా యలకన్న ఎక్కువ లేదు. ఈ రీతిగా తక్కువ ఆదాయం వస్తున్నది. సగటున, భూమి లేనటువంటి వాళ్ళను, కొద్ది పాటి భూమి ఉన్నటువంటి వ్యవసాయ కార్మికు లను అందరిని కలుపుకున్నట్లయితే ఈ పరిస్థితి కనపడుతున్నది. వ్యవసాయ కార్మిక నివేదికను యింకొంచెం లోతుకు వెళ్ళి చూసినట్లయితే సగటున కుటుంబానికి 50

రూపాయలు ఆదాయం వచ్చేటటువంటి వాళ్ళు, 50 నుంచి 100 రూపాయల ఆదాయం వచ్చే వాళ్ళు, (100 నుంచి 150 రూపాయలు వచ్చే వాళ్ళు, 150 నుంచి 300 వరకు వచ్చిన ఆదాయాన్ని ఆ విధంగా సగటున విభజించి చూస్తే) సంవత్సరానికి 150 రూపాయల లోపు మాత్రమే ఆదాయం వచ్చేటటువంటి వ్యవసాయ కార్మికుల కుటుంబాలు 100 కి 75 మందికి తక్కువ లేకుండా ఉన్నారని వాళ్ళ లెక్కలవల్ల సూచింపబడుతోంది. ఈ నాడు వ్యవసాయంమీద ఆధారపడేటటువంటి జనాభానుచూచినట్లయితే పట్టణాలలో నివసించే వారుగాని, గ్రామాలలో నివశిస్తున్న వారుగాని-వ్యవసాయ కార్మికసంఘ నివేదికనుబట్టి 100కి 57 మంది, census లెక్కల ప్రకారం 100కి 56 మంది, వ్యవసాయ కూలి వృత్తుల మీద ఆధార పడి జీవిస్తున్నారు. అందులో 100 కి 75 మందికి కుటుంబానికి 150 రూపాయల కన్న తక్కువే ఆదాయం వస్తున్నది. ఈ రోజున ఒక్కొక్క కుటుంబం నెలకు 12 రూపాయలతో జీవితం చేస్తున్నప్పుడు వాళ్ళ యొక్క ఆదాయం పెంచే దానికి మార్గం ఏమన్నా ఉన్నదా? 120 రోజులు, 150 రోజులకు మించి పని దొరకనప్పుడు పని దొరికేటట్లు చేస్తూ వాళ్ళ యొక్క జీవిత స్థాయిని పెంచే దానికి ఏమన్న మార్గం ఉన్నదా? కోటాను కోట్లుగా ఉన్నటువంటి వ్యవసాయ కార్మిక జనాభాకు పని చూపించి, వ్యవసాయాభివృద్ధికి గాని, పారిశ్రామికాభివృద్ధికి గాని, జాతీయ పునర్నిర్మాణం కోసం గాని వీళ్ళందరిని సమీకరించే పద్ధతి ఏమన్నా ఉన్నదా? అనే సంగతి మనం ఈరోజు దృష్టిలో పెట్టుకోవాలి. అట్లా దృష్టిలో పెట్టుకొన్నపుడే భూసంస్కరణలకు విలువ వస్తుంది. ఏ ప్రభుత్వమైనా కూడా ముందెప్పుడో పరిశ్రమలు ఏర్పాటు చేస్తాము, గ్రామ సీమలలో అదనంగా ఉండి 120 రోజులు, 150 రోజులకు మించి పని దొరకకుండా ఉన్నటువంటి వాళ్ళందరికి మేము ఏర్పాటు చేసేటటువంటి పరిశ్రమలలో పని కల్పిస్తాము, కట్టబోయేటటువంటి ప్రాజెక్టులలో పని కల్పిస్తాము అని అనుకోవటం అర్థంలేనటువంటి మాట. కనీసం ఒక దశాబ్దం అన్నా వ్యవసాయాభివృద్ధితోపాటు పారిశ్రామికాభివృద్ధి కూడా చేసినప్పుడే వీళ్ళందరికి పని కల్పించడం సాధ్యం అవుతుంది గాని లేకుంటే లేదు. 10 ఏండ్ల తరువాత ఎప్పుడో పారిశ్రామికాభివృద్ధి అవుతుంది అంటే కనీసం పరిశ్రమలలో తయారైన వస్తువులను కొనుక్కొనే తాహతైనా ప్రజలకు ఉండాలి కదా! 100 కి 57 మంది వ్యవసాయ కార్మికులు ఉన్నట్లయితే, అందులో 100 కి 75 మంది కుటుంబానికి నెలకు 12 రూపాయలు-కుటుంబంలో ముగ్గురు ఉన్నప్పుడు తలకు మూడు రూపాయలు-ఆదాయం వచ్చేటటువంటి వాళ్ళు పరిశ్రమల నుంచివచ్చే వస్తువులను ఏమి కొనగలుగుతారు? పరిశ్రమలు ఏరకంగా నిలబడతాయి? ఏరకంగా ముందుకు పోతాయి? అందుచేత వ్యవసాయాభివృద్ధి కావాలంటే- అధికాహారోత్పత్తి కావాలన్నట్లయితే వ్యవసాయ కార్మికులకు భూమి యిచ్చినప్పుడే యిది సాధ్యం అవుతుంది, లేకుంటే కాదు. అందువల్ల ఎవరైతే కష్టపడి భూమిని సాగు చేస్తారో, ఎవరైతే ఎక్కువ పంటలు పండిస్తామని ముందుకు వస్తారో, వారికి భూమిని యివ్వండి. పని చేయకుండా ఎక్కడో

కూర్చున్నటువంటి పెద్ద పెద్ద భూస్వాముల దగ్గర కాదు భూమి ఉండాల్సినది. Tractors పెట్టి వ్యవసాయం చేస్తారు. నిగామానులు పెట్టి, మనుష్యులను పెట్టి వ్యవసాయం చేయిస్తారు. పంటలు ఎక్కువ చేస్తారు అని చెప్పేదాంట్లో కూడా అర్థంలేదు. తాను పండించేది తన కుటుంబానికి, తన దేశానికే ఉపయోగ పడుతుంది అనేభావం ప్రజలలో కలిగి నప్పుడే-వ్యక్తి దగ్గరనుంచి కుటుంబం, కుటుంబం దగ్గర నుంచి దేశం ఆ రకంగా అభిప్రాయం కలిగి నప్పుడే-సహకార పద్ధతుల మీద వ్యవసాయానికి వచ్చినప్పుడే విస్తృత వ్యవసాయం యొక్క లాభాలు కనపడ తాయిగాని ఉన్న భూమి అంతా ఏకొద్దిమంది చేతులలోనో పెట్టి ప్రజలయొక్క కండ్లు తుడిచే దానికోసం ceiling తెస్తున్నాం అని చెబితే అది భూసంస్కరణల యొక్క నిజమైనటువంటి ఉద్దేశ్యం కానేకాదు. Planning Commission వారు వ్యవసాయ సంస్కరణల గురించి ceiling ఎంత పెట్టాలి? ఏరీతిగా ఉండాలి అనే విషయాన్ని గూర్చి Land Panel కు సూచించినప్పుడు ఆ Land Panel 3,600 రూపాయలు నికరాదాయం వచ్చేది ఒక కుటుంబానికి వదలి మిగిలింది పంచితే కొంతవరకు భూమి వచ్చే దానికి వీలు ఉంటుంది, అంతకన్న ఎక్కువ చెయ్యలేము అనేరీతిగా వారు సూచించడం జరిగింది. భూసంస్కరణల యొక్క అసలు ఉద్దేశ్యం ఏమిటి? గ్రామ సీమలలో భూమి లేనటువంటి వ్యవసాయ కార్మికులకు భూమి యివ్వాలని దాని వల్ల కొంతవరకు నిరుద్యోగాన్ని పరిష్కరించాలని, దాని వల్ల వారి జీవిత స్థాయిని పెంచాలని, వ్యవసాయాభివృద్ధిలో వారికి ఉత్సాహం కలిగించి అధికోత్పత్తి, పారిశ్రామికాభివృద్ధి ఈ రెంటింటిని సాధించేదానికి యిది పునాది అని చెప్పడం జరిగింది. కాని ఈ నాడు ఆంధ్ర ప్రదేశ్ లో ఉన్నటువంటి కాంగ్రెసు మంత్రి వర్గం ధీమాగా మేము పెట్టిన ceiling ప్రకారం లక్ష ఎకరాలకు మించి పంచేదానికి సాధ్యం కానే కాదు. ఏ యితర రాష్ట్రాలలోను పెట్టనంత ఎక్కువగానే మేము పెడుతున్నాము, అని చెప్పుతూ ఉన్నది. ఎవరిని సంతృప్తి పరచటానికి ఈ ceiling? మంత్రి గారి వెనకాల Benches లో కూర్చున్న భూస్వాములను, భూసామ్య ప్రతినిధులను సంతృప్తి పరచే దానికి మేము యితర రాష్ట్రాలకన్న ఎక్కువ పెడుతున్నాం. మీ భూమి ఏమీ పోదు, అని చెప్పుతున్నారు. తెలంగాణాలో కోటి 60 లక్షలు, ఆంధ్ర ప్రాంతంలో కోటి 80 లక్షలు కలిసి మొత్తం ఆంధ్ర ప్రదేశ్ లో 2 కోట్ల 50 లక్షల ఎకరాలు ఉంటే దానిలో ఒక లక్ష ఎకరాలు మాత్రమే తీసి పంచుతాము అంటున్నారు. ఆంధ్ర ప్రాంతంలో 20 ఎకరాలు దాటినటువంటివారి census చూస్తే 90 లక్షల ఎకరాలు వారిక్రింద ఉన్నవని చెప్పారు. ఇందులో లక్ష ఎకరాలకంటె తీయము. ఇతర రాష్ట్రాల కంటె ఎక్కువగానే పెట్టినాము. ఎందుకు దీనిని వ్యతిరేకిస్తారు అని చెప్పడం తప్పితే మరేమీ జరుగుట లేదు. అసలు భూసంస్కరణల ఉద్దేశం భూమి లేనివారికి భూములు యివ్వాలని కావే

కాదు. ఒకరి దగ్గర 1000 ఎకరాలు, ఇంకొకరి దగ్గర 10, 15, 20 ఎకరాలు ఉండడం ఎందుకు, ప్రతివారి దగ్గరా 100, 200 ఎకరాలు ఉండేటట్లు చేసుకోవచ్చు అనే ఉద్దేశంతో సీలింగ్స్ తెస్తున్నాము తప్పితే ఇంకొకటి కాదు. వ్యవసాయ కార్మికునికి భూమి యివ్వడం మా ఉద్దేశం కాదు. ఒకరి దగ్గర వేల కొలది ఎకరాలు, మరొకరి దగ్గర 15, 20 ఎకరాలు ఉండడమెందుకని అందరి దగ్గర 100 నుంచి 200 ఎకరాలు ఉంచి, వ్యవసాయం చేసుకోవడానికి వీలుగా చేస్తున్నాము అంటే అది ప్లానింగ్ కమీషన్ ఉద్దేశ్యం కాదు. సాంఘిక న్యాయం కూడా కాదు. వ్యవసాయాభివృద్ధికి అది దోహదం చేయదని మాత్రం ఇక్కడ మేము చెప్పవలసి వుంటుంది. ఇది ఒక దృక్పథము. ఇక రెండవ దృక్పథము. భూమి ఎవరికి ఉంది? ఆ విషయం గూర్చి కూడా చెబుతారు చాలామంది భూస్వాములు, భూస్వామ్య ప్రతినిధులు. గ్రామసీమలలోనికి ప్రచారానికి పోయినప్పుడల్లా ఇతర ఏ ఆదాయాలకు సీలింగు పెట్టకుండా భూమిమీద వచ్చే ఆదాయానికి మాత్రమే ఎందుకు సీలింగు పెట్టాలి అని అంటూఉంటారు. దానికి సమాధానం చెప్పడానికి యీ నాడు మంత్రిగారు ఎంతో కష్టపడి ప్రయత్నం చేశారు. ఇంతకూ వారు చెప్పిన సమాధానం యిది: ఈనాడు భూమిమీద వచ్చే ఆదాయానికి మేము సీలింగు పెట్టబోతున్నాము. ఏదో కళ్లు తుడవడానికి భూమి పంచినట్లు ప్రజలకు కనపడాలికదా, సీలింగు రూ 5400/ లు అని పెడుతున్నాము. అంటే ఒక్కొక్కరు 50 నుంచి 200 ఎకరాల భూమివరకూ అట్టి పెట్టుకో వచ్చును. ఎక్కువ ఆదాయం రాబట్టుకో వచ్చును. ద్రాక్ష తోటలు, పసుపు తోటలు, అరటి తోటలూ వేసుకోవచ్చు. వీలైతే రెండు, మూడు పంటలు పండించుకో వచ్చును. ఎరువుల మీద ఎరువులు వేసుకో వచ్చును. ప్రభుత్వం దగ్గరకు వచ్చి అడిగితే కావలసినన్ని ఎరువులు యిస్తాము, కావలసినన్ని అప్పులు యిస్తాము. పెద్దపెద్దవారికి యీ సౌకర్యాలన్నీ కల్పిస్తుంటాము. పెద్దవారికే ట్రాక్టరులు యిస్తాము. విద్యుచ్ఛక్తియిస్తాము. రూ 5400 లు అనే ఆదాయాన్ని 50 వేలు చేసుకున్నా మేమువద్దు అనముకదా, ఆ విధమైన సీలింగు రాదని నేను అభయం యిస్తున్నాను అనే విధంగా వారి వెనుక బెంచీలపై కూర్చున్న భూస్వాములను బ్రతిమలాడి చెబుతున్నారు. ఇక ముఖ్యమంత్రిగారు ఏమన్నారంటే— ఈనాడు భూసంస్కరణలు తెచ్చి, సీలింగులు నిర్ణయిస్తున్నాము. మా చేతిలో అధికారం ఉన్నట్లయితే అన్ని రకాల ఆదాయముల మీద కూడా సీలింగులు పెట్టడానికి ముందుకు వస్తాము, కాని, ఆ అధికారం కేంద్రం చేతిలో ఉన్నది. అందువల్లనే మేము యితర ఆదాయాల మీద సీలింగు పెట్టడము లేదు. ఇతర ఆదాయాల మీద సీలింగు పెట్టడానికి భూమి సీలింగుయే మొదటిమెట్టు. దానికోసం కూడా కృషి చేస్తాము అన్నారు. ముఖ్యమంత్రిగారు ఒక విధంగానూ, రెవిన్యూ మంత్రిగారు మరొక విధంగానూ చెబుతున్నారు. ఢిల్లీలోని ప్లానింగ్ కమీషన్ ఇంకొక విధంగా చెబుతున్నది. ఈ నిరర్థకమైన బిల్లునైనా వ్యతిరేకించకుండా బలపరచండి. మంత్రిగారు భూసంస్కరణల పేరిట

ప్రజలకు ఏదో మేలు చేస్తున్నారని అందరూ అనుకొనేందుకు గాను ఆమోదించండి. ఇది భూమి ఆదాయాల మీద సీలింగు కానేకాదు అని భూస్వాములను ఒప్పించడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఒకరి దగ్గర 1000 ఎకరాలు, మరొకరి దగ్గర 15, 20 ఎకరాలు ఉండేకంటే అందరూ 100 నుంచి 200 ఎకరాలదాకా అట్టేపెట్టుకొని 50 వేలైనా ఎన్ని వేలైనా సంపాయించుకోవచ్చు. ఇది మాత్రం భూమి మీద వచ్చే ఆదాయాలకు సీలింగు పెట్టడం కానేకాదని మంత్రిగారు చెబుతున్నారు. ఈ రీతిగా చేసి, దేశాన్ని పునర్నిర్మించగలమని అనుకోవడం కేవలం పొరపాటేనని మాత్రం నేను హెచ్చరిక చేస్తున్నాను.

ఈనాడు భూమికి పరిమితులు పెడుతున్నాము. భూమ్యాదాయాలమీద కూడా పరిమితిపెట్టి, ఇతర ఆదాయాలన్నింటిమీదా కూడా వెనువెంటనే, సాధ్యమైనంత తొందరలో సీలింగ్సు పెట్టినట్లయితే దేశం ముందుకు పోతుంది. నూటికి 80 మందిగా ఉన్నవారి జీవితస్థాయిని పెంచకుండా ఇద్దరి ముగ్గురి లాభాలను మాత్రమే దృష్టిలో పెట్టుకొని, వారికి ఏమాత్రం కూడా నష్టం లేనిరీతిగా భూసంస్కరణలు తెస్తామని, ఇష్టంవచ్చిన రీతిగా ఆదాయాలను సంపాయించుకోవచ్చునని, లాభాలను వృద్ధి చేసుకోవచ్చుననీ, కోట్లకొలది డబ్బు ఆర్జించుకో వచ్చునని చెప్పడం మంచిదికాదు. దేశం ఏమైపోయినాసరే, ప్రజలు ఏమైనాసరే భూస్వాములకు మేలు చేయడం అనే విధానం మాత్రం సాంఘిక న్యాయం అనుపించుకోనేరదు. కాంగ్రెసుపార్టీ వారు చెబుతున్న సోషలిస్టు తరహా ప్రజాస్వామ్యానికి కూడా ఇది సరైన ప్రాతిపదిక కాదు. ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకొన్నప్పుడు ఒక్క భూమికి మాత్రమే కాక, ఇతర ఆదాయాలన్నిటికి కూడా సీలింగ్సు పెట్టాలనేది మా పార్టీయొక్క కోరిక. అది మాచేతిలో లేదంటే, రండి, మనమంతా కలిసి కృషిచేద్దాము. అవసరమైతే కేంద్రం మీద ఒత్తిడి తేవడానికి కృషిచేద్దాము. ఇతర ఆదాయాలకు ఎంత సీలింగు ఉండాలనేది యిప్పటి చర్చనీయాంశం కాదనుకోండి. భారతదేశంలో పండే పంటలను బట్టిగాని, పారిశ్రామికంగా వచ్చే ఆదాయాలను బట్టిగాని చూసుకుంటే, 5 మంది ఉండే కుటుంబానికి సగటున 100 రూపాయల కంటే ఎక్కువ ఆదాయం లేదు. గ్రామసీమలలో నివసించేవారికైనా, పట్టణవాసాలలోనివారికైనా రెండు పూటలా తిండితిని, బట్టలు కట్టుకునే స్థితి ఉండాలంటే నలుగురుగల కుటుంబానికి 100 రూపాయలు కావాలని ప్రభుత్వం యిచ్చిన లెక్కల ప్రకారమే తెలుస్తున్నది. ఇది అందరూ అంగీకరించినదే. ఈనాడు అసెంబ్లీలో నిలబడిన జవానులకుగాని, 4వ తరగతి ఉద్యోగులకుగాని, వ్యవసాయ కార్మికులకు గాని సగటున 100 రూపాయలు ఇవ్వగలమా? ఈనాడు వ్యవసాయ కార్మికునికి ఎంత ఆదాయం వస్తున్నది? వారు నూటికి 75 మంది ఉన్నారు. వారి కుటుంబానికి నెలకు 25 రూపాయలకంటే యివ్వడంలేదు. నూటికి 75 కుటుంబాలవారికి నెలకు

12 రూపాయలకంటే ఎక్కువ ఇవ్వడం లేదు. 100 రూపాయలు కనీసవేతనం ఇవ్వాలంటే, అదనంగా ఉన్నవారికి వేయి రూపాయలకంటే ఎక్కువ ఇవ్వకూడదు. ఈ 75 మంది కుటుంబాలకు 100 రూపాయలు కనిసవేతనం ఇవ్వగలమా లేదాఅనే విషయం అట్టే బెట్టండి. ఎవ్వరికి కూడా 1000 రూపాయలకు మించకుండా, తక్కువ ఆదాయం గలవారి ఆదాయాలను కనీసం 100 రూపాయలు వచ్చే వరకూ వారి స్థాయిని పెంచుకుంటూ పోవాలనే దృష్టిలో ఉంటే, ఇతర ఆదాయలమీద కూడా సీలింగు పెట్టవలసి వుంటుంది వ్యవసాయాదానికీ, ఇతర ఆదాయాలకూ కొంచెం భేదం ఉండకతప్పదు. పరిమితమైన భూమిలోనుంచి పంటలను పండించవలసి వుంటుంది. ఎందుకు 57 మందిగా ఉన్న వ్యవసాయ కార్మికులకు కాస్తో, కూస్తో భూమి ఇవ్వాలనుకున్నప్పుడు, వారికి ఇతర విధముగా పని చూపించడం సాధ్యం కాకపోయినప్పుడు తక్కువ భూమికి సీలింగు పెట్టవలసి వుంటుంది. శ్రీ కళా వెంకటరావుగారు 3600 అని సీలింగు పెట్టినట్లయితే కుటుంబానికి సగటున ఎకరం 150 రూ. లు ఆదాయంవచ్చే 20 ఎకరాలతరిభూమి ఉంటుందని వారి ఉపన్యాసంలో చెప్పినారు.

శ్రీ కె. వెంకటరావు:—నేను ఎగ్జాంపుల్ గా చెప్పాను, అంతే.

శ్రీ పి. సుందరయ్య:—అదే, ఎగ్జాంపుల్ చెప్పారనుకోండి. 150 రూపాయలు మాత్రమేకాదు. మామూలు తరి భూమిలో యీనాడున్న ధరను బట్టి చూచుకుంటే 200 నుంచి 250 రూపాయలదాకా నికరాదాయం వస్తుంది. రెండు పంటలు పండే భూమికి ఇంకా ఎక్కువ ఆదాయిమే రావచ్చు. మరీ నికృష్టమైన భూమి అయితే తక్కువ కూడా రావచ్చు. 200, 250 అనే చర్చలోకి పోకుండా 18, 20 ఎకరాలు ఒక కుటుంబానికి వదలడం జరుగుతుంది. ప్లానింగు కమిషన్ సూచించినది 3600, నికరాదాయం. ఇదివరకు తెలంగాణా సీలింగ్సులో కూడా 3600 నికరాదాయం అనేది ఉన్నది. 5 మంది ఉన్న కుటుంబానికి 20 ఎకరాల చొప్పునమిగిల్చినట్లయితే మిగిలిన వారికి కాస్తో కూస్తో భూమి ఇవ్వడానికి వీలుంటుంది. 3600 అని నిర్ణయించినప్పుడు భూమి రైతులనుంచి తీసుకోవడం జరుగుతుందా? ఎప్పటికీ కాదు. కష్టపడి పనిచేసే రైతు నుంచి ఏమీ తీసుకోవడం లేదు. అదే న్యాయం కూడా. దున్నేవానికే భూమి ఉండాలి అనే సూత్రం పాటించాలి నిజమైన సోషలిజం అయితే. ఈనాడు మేము ఇంతవరకు కూడా అడగడం లేదు. దున్నేవానికి భూమి ఇవ్వండి అని ఇప్పుడు అడగడం లేదు. దున్నేవానితోపాటు మేనేజిమెంటు చేసే వారికి కూడా—వారు భూమిమీదకు వెళ్ళి దున్నకపోయినప్పటికీ, వారి కుటుంబంలో ఏ ఒక్కరూ పనిచేయకపోయినప్పటికీ, సంవత్సరం పొడుగునా వ్యవసాయ కూలీలను పెట్టుకొని పనిచేస్తున్నప్పటికీ కూడా 3600 రూపాయలదాకా నికరాదాయం

వచ్చేటట్లు చేయాలని మనమంతా అంగీకరించాము. క్రమేణా దేశాభివృద్ధిని సాధించాలనే ఉద్దేశంతోనే పని చేసేవారికే భూమి ఉండాలి, చేయని వారికి భూమి ఉండకూడదనే సోషలిస్టు సిద్ధాంతమును అమలు పెట్టుటలో 3600 వరకూ సీలింగు పెట్టాలని అన్ని పార్టీలు కూడా అంగీకరించాయి. ప్రణాళికలలో కూడా వ్రాశాము. ఇప్పుడు 3600 కంటె పైకి ఎందుకు పోతున్నారు? భూమిలో కష్టపడి పనిచేసేవాడు రైతు, కాని, కాలుమీద కాలు వేసుకొని కూర్చుని భూమిని కౌలుకు ఇచ్చో, లేక కూలీలను పెట్టి చేయించుకొనో వ్యవసాయం చేస్తూ, ఇతర ఆదాయాలు సంపాదించుకొనే వారిని రైతులనడంలో అర్థం లేదు, వారు రైతులు అనబడతారా? కుటుంబానికి 3600 రూపాయల ఆదాయం పెట్టి, 20 ఎకరాల సీలింగు పెట్టినట్లయితే బాగుంటుంది. అంతకు మించిన భూములు గలవారు పని చేయడం లేదు సరికదా, మేనేజిమెంటు అయినా చేస్తున్నారా అంటే అది కూడా లేదు. పనిచేసే వారి కుటుంబాలకు 20 ఎకరాలకంటే ఎక్కువ భూమి వదలి, మిగిలినది పంచిపెట్టమని మాత్రమే మేము కోరుతున్నాము. అదే న్యాయంకూడాను. అది న్యాయం. కష్టపడే రైతునుండి భూమి తీసుకోవాలని మేము అనడంలేదు. పేద రైతులకు, భూమిలేని వ్యవసాయం కార్మికులకు భూమినివ్వడం ద్వారానే నిరుద్యోగ సమస్య పరిష్కారమవుతుంది, దాని ద్వారానే అధికోత్పత్తి సాధ్యమని మేము పదే పదే చెబుతున్నాము. ఎంతమంది దగ్గర నుండి భూమిని తీసుకొని, దానిని ఎంతమందికి పంచిపెట్టాలి? అనే ప్రశ్న యిప్పుడు మనముందు ఉన్నది. 1953—54 సంవత్సరంలోని lanl census లెక్కలు ప్రకారం ఆంధ్ర ప్రాంతంలోని భూమి నంతటినీ Stanlarl areas క్రింద లెక్కలు వేశారు. తెలంగాణా ప్రాంతంలో converted dry అని లెక్కలు వేశారు. ఈ రెంటినీ పోల్చిచూచుకొనడానికిగాను ఒక stanlard area 5 ఎకరాల మెట్టకు సమానంగా మనం పరిగణించ వచ్చును. ఒక ఎకరం stanlarl area లోపు భూమి గలిగిన కుటుంబాలనన్నిటినీ వ్యవసాయ కార్మికులక్రింవనే పరిగణించవలసి యుంటుంది. ఎందుకంటే వారు కూలికికూడా వెడుతున్నారు గనుక. ఇటువంటివి 26 లక్షల కుటుంబాలు మన ఆంధ్ర ప్రదేశంలో ఉన్నవి. వారి దగ్గర మొత్తం 8 లక్షల Standard acres ఉన్నవి. అలాగే 1 నుంచి 2 1/2 ఎకరాల మధ్య భూమి గలిగినవి 12 లక్షల కుటుంబాలు మనరాష్ట్రంలో ఉన్నవి. వీరిక్రింద మొత్తం 19 లక్షల standard acres ఉన్నవి. యిక 2 1/2 ఎకరాల నుండి 5 ఎకరాల వరకు భూమి గలిగిన కుటుంబాలు, 5 నుండి 10 ఎకరాల భూమి గలిగిన కుటుంబాలు, 10 నుండి 20 ఎకరాల లోపల భూమి గలిగిన కుటుంబాలు ఉన్నవి. పని చేసినా చెయ్యకపోయినా వారిని మధ్యతరగతి రైతాంగం క్రింద మనం పరిగణించవచ్చు. యిక 20 ఎకరాలు

పైన (standard acres) భూమి గలిగినవి మొత్తం 80 వేల కుటుంబాలు మన రాష్ట్రంలో ఉన్నవి. వీరి క్రింద 27,30000 Standard acres వుంది. అంటే దాదాపు నూటికి 22 పాళ్ళు ఉన్నది అన్నమాట. అయితే వీరు జనాభాలో 1 1/2 శాతం అవుతుంది. అయితే యీ లెక్కలన్నీ వుజ్జాయింపుగా వేసినవని నే నంగీకరిస్తున్నాను. ముఖ్యంగా భూ కేంద్రీకరణలో యీ లెక్కలన్నీ కనిపించవలసినదే కాని అవి మనకు కనబడలేదు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, 1948 వ సంవత్సరంలో మొట్ట మొదటి సారిగా భూ సంస్కరణలు ఎట్లా వస్తాయనే ఆందోళన బయలుదేరినది. ఆంధ్ర ప్రాంతంలో 'జమిందారీ రైతు ఉద్యమం' రూపంలో ఈ ఆందోళన కనబడింది. తెలంగాణాలో police action తరువాత 1952 లో Tenancy Act వచ్చినప్పుడు సీలింగు ఎలా పెడతారు? అనే ఆందోళన భూస్వాములలో బయలుదేరింది. అప్పటినుండే అదనంగా భూములు కలిగిన భూస్వాములందరూ వారి భార్యలపేర, కొడుకుల పేర, కూతుళ్ళపేర భూములు వ్రాసేశారు. ఖమ్మంలో ఈ విధంగా జరిగిన ఉదాహరణలు మేము యిదివరకే చెప్పివున్నాము. నిజాంలో పాడిపశువులకు కూడా భూములు వ్రాసిన సంఘటనలు ఉన్నవి. 1953—54 సెన్సస్ లెక్కలు పరిశీలించి నట్లయితే అప్పటినుండే గాక 1952 నుండే భూస్వాములలో యిటువంటి గణనీయమైన సంచలనం బయలుదేరినట్లు గుర్తించవచ్చు. కుటుంబంలోవున్న ప్రతివారిని పేర యీ విధంగా భూమిని వ్రాసికొనడం వలన ప్రభుత్వపు లెక్కలలో యిదంతా ఒక కుటుంబంగా గాక వేరు వేరు కుటుంబాలుగా విభజితమైంది. అందు వలన మనం అంచనా వేసిన యీ 80 వేల కుటుంబాలు నిజంగాను. ఇంతకంటే చాల తక్కువ కుటుంబాలు వుంటాయి. వారిందరినీ కలిపినట్లయితే ఒకే కుటుంబంలో యిప్పుడువేసిన లెక్కలకంటే వారిదగ్గర ఎక్కువ భూమి వుంటుందన్న విషయం గుర్తించవలసి యున్నది. ఈ 80 వేల కుటుంబాలలో ఒక్కొక్క కుటుంబానికి 20 ఎకరాల తరి భూమి వుంది; (అదే మెట్టలో చెప్పవలసివస్తే 100 ఎకరాలు అవుతుంది.) మిగిలింది పంపకానికి యిమ్మని అడగకుండా వారికిపూడా నష్టపరిహారం యిస్తాము అంటున్నారు. ఎందుకంటే constitution లో ఉంది కాబట్టి. వారు కష్టపడి పనిచేసినా, చేయకపోయినా, వారికి యితర ఆదాయం ఉన్నా, లేకపోయినా, ఒక్కొక్క కుటుంబానికి 20 standard acres చొప్పున యీ 80 వేల కుటుంబాలకు మొత్తం 16 లక్షల ఎకరాలు యివ్వడం జరుగుతుంది. 1953—54 Land Census లెక్కల ప్రకారం ఆ విధంగా 16 లక్షల ఎకరాలు పోగా యింకా 11 లక్షల ఎకరాల వరకు మిగులుతుంది. ఇప్పుడు ఒక ఎకరం లోపల భూమి గలిగి వ్యవసాయకూలీలుగా జీవించే కుటుంబాలు 26 లక్షల వరకు రాష్ట్రంలో వున్నవి. వారివద్ద 8 లక్షల ఎకరాల భూమి వుంది. యిప్పుడు మిగిలిన 11 లక్షల ఎకరాలు,

యీ 8 లక్షల ఎకరాలు కలిపి, దానికి యింకొంచెం బంజరు కలిపి పంచినట్లయితే ఒక్కొక్క కుటుంబానికి ఒక ఎకరం చొప్పున వస్తుంది. అప్పుడు వారు ఆ ఎకరం భూమిలో 10 బస్తాల ధాన్యంగాని, లేదా 5 బస్తాల ధాన్యం, మిగిలింది జొన్నలు పండించుకున్నా ఒక కుటుంబానికి ఒకపూట చొప్పున సంవత్సరానికి ఆహారం సమకూడుతుంది. అప్పుడు వారు యింకా అదనంగా పండించుకొనడానికి ఉత్సాహపడతారు. ఇదీ అసలు భూసంస్కరణలయొక్క ఉద్దేశ్యం అది గాకపోతే అసలు యీ సీలింగు బిల్లుకు అర్థమేలేదు. అయితే అసలు అంత భూమి ఉందా? అంటే "ఉంది" అని నేను చెబుతాను.

శ్రీ కళా వెంకట్రావుగారు ఎక్కడికి వెళ్ళినా—వారి ఉపన్యాసాల్లో— 'మీరు మనుష్యులను పుట్టించుతున్నారు, కాని భూమి మాత్రం సాగమంటే సాగడం లేదు ఎక్కడ వుందయ్యా భూమి?' అని అడుగుతూ వుంటారు

(Sri K. Venkata Rao interruption)

ఇప్పుడు మానేశారనుకుంటాను ఆప్రచారం. చాలా సంతోషం.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్:—'మా యిద్దరికీ ఆ బాధ లేదు'; అంటున్నారు వారు.(నవ్వు)

శ్రీ పి. సుందరయ్య:— మా యిద్దరి సంగతే అయితే మేము యిక్కడ కూర్చొనవలసిన అవసరం లేదు. ప్రజానీకంయొక్క బాధ్యతలతో వారక్కడ కూర్చున్నారు. దాన్ని బట్టే నేను కూడా యిక్కడ కూర్చున్నాను. వారందరి తరపున మనం మాట్లాడుతున్నాం.

ఈ విషయాలన్నిటినీ పరిశీలించి, వ్యవసాయాభివృద్ధికి పునాదిగా భూ సంస్కరణలను తీసుకు రావాలి. అంతేగాని, ఏదో కమ్యూనిస్టులు గోల చేస్తున్నారు, ప్రజలు సీలింగు పెట్టమంటున్నారు, కాంగ్రెసు తీర్మానాలు చేస్తున్నది, అందువలన వీటన్నిటి కళ్ళు తుడవాలనే పద్ధతితో సీలింగు పెట్టామంటే సీలింగు పెట్టాము అనేవిధంగా చేయకూడదు. ప్రభుత్వం నిజంగా వ్యవసాయాభివృద్ధిని కాంక్షించినట్లయితే, దేశ పునర్నిర్మాణాన్ని వాంఛించినట్లయితే, సాంఘిక న్యాయం కావాలనుకున్నట్లయితే, సోషలిస్టు తరహా సమాజం స్థాపించదలచుకున్నట్లయితే, పని లేని వారికి పని చూపించదలచుకున్నట్లయితే ఆచరణలో విజయవంతమయ్యే సంస్కరణలు తీసుకరావాలి! కమ్యూనిస్టులు అల్లర్లు చేస్తున్నారు. లేకపోతే ప్రాగ్జ్యోతిషపూర్ కాంగ్రెసు మహాసభ తీర్మానాలుచేస్తున్నది. మేము కూడా కాంగ్రెసు సభ్యులమే

గనుక దానికి తల వొగ్గుతాము; అనే దృష్టిని వదలివేయాలి. ఎవరికళ్ళో తుడవ దానికి ప్రయత్నించడం అనవసరం. ఈ సంస్కరణలు గనుక ప్రవేశ పెట్టి నట్లయితే దేశంలో పనిలేనివారికి పని కల్పించబడుతుందా? భూమిలేనివారికి భూమి సమకూడుతుందా? అనే దృష్టితో చూడవలసిందిగా కోరుతున్నాను. ఈ 80 వేల కుటుంబాలవద్ద అదనంగావున్న భూమిని తీసుకొని అందరికీ పంచాలని మా వుద్దేశం. ఇదివరకు 3,600 రూపాయలు నికరాదాయం వుండేవిధంగా సీలింగు వుండాలని ప్లానింగ్ కమీషన్ సూచిస్తే దానిని త్రోసిపుచ్చింది మన ప్రభుత్వం. 3,400 రూపాయలు నికరాదాయం వుండవలెనని తెలంగాణాలో బిల్లు వుంటే దానిని కూడా త్రోసిపుచ్చారు. ఈ విధంగా చేయడం వ్యవసాయ సంస్కరణలు ముందుకు పోవడంకాదు; వెనక్కిపోవడమేనని మనవిజేస్తున్నాను.

తరువాత మొత్తం పండిన పంటలో సగభాగంవరకు ఖర్చు అవుతుందని లెక్కవేయడం సరికాదు. ఎక్కడో పనికిమాలిన భూములలో యీ విధంగా వుండ వచ్చును. అవైనా చాలా కొద్ది భూములలో మాత్రం. సంవత్సరానికి 6, 7 నెలల వరకు మంచినీటి వసతి గలిగివున్న భూములుగాని, నల్లరేగడి భూములలోగాని చూసినట్లయితే మొత్తం ఫలసాయంలో 4 వ వంతు వ్యవసాయ ఖర్చులు అవుతవి. అంతకు మించి ఎక్కువగా ఏ పరిస్థితులలోనూ కాదు.

నీటి వనరులు ఉన్న ప్రాంతాలలోను, నల్లరేగడి ప్రాంతాలలోను ఫలసాయం లో నాల్గవ వంతుకు మించి ఎక్కువ ఖర్చు ఏ పరిస్థితిలోనూ ఉండదు. మిగతా ప్రాంతాలలో మూడవ వంతుకు మించదు. 4800 రూపాయల ఫలసాయంలో 3600 రూపాయలు నికరాదాయం ఉంటుందని ప్లానింగ్ కమీషన్ చెప్పింది. సగటున ఫలసాయంలో నాల్గవవంతు కంటె ఎక్కువ ఖర్చును మినహాయించ కూడదని చెప్పినారు. కాని యిప్పుడు సగానికి మించకూడదని పెట్టినారు. ఆంధ్ర ప్రాంతంలో అన్ని జిల్లాలలోనూ. ఖర్చు సగమని అర్థమా? కృష్ణా, గోదావరి డెల్టాలలో దుక్కి దున్నకుండా, నీరు పెట్టకుండా, నారు నాటి వచ్చిన పంట పండుతుంది. ఆ భూములలో ఖర్చులు ఫలసాయంలో సగం ఎలాగవుతుంది? కష్టపడి పనిచేసు కున్న కుటుంబానికి యింకా తక్కువ ఖర్చు ఔతుంది. కష్టపడి పని చేయకుండా, వ్యవసాయమంటే ఏమిటో; తమ భూములు ఎక్కడ ఉన్నవో తెలియనట్టి భూస్వాములకు ఖర్చు ఎక్కువౌతుంది. వారిని దృష్టిలో పెట్టుకొని సగమిస్తున్నారా? 3600 ఉన్న సీలింగును తీసివేసి 5400 అని పెట్టడమేగాక ఫలసాయంలో మరల సగం ఖర్చులక్రింద మినహాయింపు యిస్తున్నారు. ఇందువల్ల 10800 వరకు సీలింగ్ లిమిట్ పెంచబడింది. ఇంతే గాక ఫలసాయంలో మూడవ వంతు పశు గ్రాసంకొరకు పెట్టుకోవచ్చునని యింకొక నిర్వచనమిచ్చారు. కోస్తా జిల్లాలలో

పశుగ్రాసానికి ప్రత్యేకభూములు లేవనే విషయం కళా వెంకట్రావుగారికి, అందరికి తెలుసు. కాని ఈ నిర్వచనం ప్రకారం స్థానికంగా భూమి ఉన్నా, లేకపోయినా ఆంధ్రదేశంలో ఎక్కడైనా భూమిని పెట్టుకోవచ్చునని తేలుతున్నది. ఆ భూములు మామూలుగా యింతకు పూర్వం పండించినప్పుడు ఎంత ఆదాయం వచ్చుచుండెనో అంత, సీలింగు నుంచి మినహాయింపు యివ్వడం జరుగుతుంది. ఒకసారి పంట పండించితే ఆ భూమి యిక ఈ క్లాజుక్రిందకు రాదని చెప్పారు. కాని బిల్లులో అది కూడా వివరంగా లేదు. సెలెక్టు కమిటీలో మార్పు చేస్తారేమో? 10800 రూపాయలు ఆదాయమే గాక 3600 రూపాయలు విలువ చేసే భూమిని యింకా వేరే యిస్తారట. ఈ విధంగా మొత్తం 14400 రూపాయలకు పెంచబడింది. పశుగ్రాసానికి కావాలన్నచో ప్రత్యేకంగా గాక తనకు యిచ్చిన భూమి లోనే వేసుకోమనండి. ఈవిధంగా భూస్వాములకు మినహాయింపుల తరువాత మినహాయింపులు యిస్తూపోయినచో ఇంకి భూములు ఎక్కడనుండి వస్తవి? కళా వెంకట్రావుగారు చెప్పినా, నేనుచెప్పినా భూమి సాగమంటే సాగదు. ఈ 14400 రూపాయల ఆదాయంతో ఆగక కుటుంబం అంటే ఏమిటో ఒక వింత నిర్వచన మిచ్చారు. ఇందువల్ల వాటాలు స్త్రీ భాగమని అసలు భాగమని, లేక gift రూపం లోనో ఎన్నో రకాలైన వాటాలకు అవకాశం ఉన్నది. జన్మతః వచ్చే అధికారానికి యిన్ని దొంక తిరుగుడులు ఎందుకు? కుటుంబం అంటే 5 గురు అని వ్యవహరిస్తు న్నారు. ఈ కుటుంబం అనే నాటకం కంటే ఐదుగురికి 5400 నికరాదాయము లేదా 10800 ఫలసాయం వచ్చునని, వచ్చికి వీళ్ళను కలిపి 14400 ఫలసాయం వచ్చేది అని స్పష్టంగా చెప్పిన బాగుంటుంది కదా! ఇప్పుడు పుట్టిన వారికే పరిమిత మౌతుందా? లేక పుట్టబోయే వారికొరకు రిజర్వేషన్ చేసి పెడతామంటే ఎంత సబ బుగా ఉంటుంది? ఈ రోజు ముగ్గురు బిడ్డలు పుట్టి ఉన్నవారిని కుటుంబ నిర్వచనంలోకి తీసుకోవచ్చు, కాని ఇక పుట్టకూడదని శాసించగలరా? హిందూకోడ్‌ను సవరించి ముగ్గురికంటె ఎక్కువ బిడ్డలను పుట్టించ కూడదని అలా పుట్టించినట్లయితే వారికి అదనంగా ఏమీ ఆదాయంరావనీ, దేనిమీద హక్కుగాని, ఏమియు కోరుకొనుటకు వీలుగాని లేదని చట్టంచేయండి, అవిదంగా పుట్టబోయే బిడ్డలకు ఆస్తి ఏమి యివ్వము అనడంలో అందం చందం లేదు. పుట్టబోయే వారికి రిజర్వేషన్ చేయమని కొంత మంది భూస్వాములు అడిగితే సెలెక్టు కమిటీలో చేస్తారేమో తెలియదనుకోండి.

భూసంస్కరణల బిల్లు వస్తుందని, సీలింగ్సు పెడతారని 1953-54 నుంచి అంటూ ఉండడంవల్ల తెలంగాణలోను, ఆంధ్రలోను అమ్మకాలు, పంపకాలు, బినామీదు ట్రాన్స్ ఫర్సు అన్ని జరిగిపోయాయి. ఇవన్నీ పోవాలంటె ఒకటే మార్గమున్నది. కుటుం బానికి మానిర్వచనం ప్రకారం (జాయింటు కుటుంబం సంగతి అలాఉంచండి) భార్యా, భర్త; పెళ్ళి కాని కూతుళ్ళు; 18 ఏండ్లు నిండని కుమారులు; తల్లి, దండ్రులు

వస్తారు. 18 ఏండ్లుదాటినతరువాత కుమారులు పంచుకొని వేరేఉండు హక్కు ఉన్నది. తల్లి దండ్రులు మినహా ఐదుగురికి మించనట్టిది కుటుంబ నిర్వచనంగా తీసుకోవాలి. అవ్వలు, తాతలు ఉంటారనేది exception cases గా తీసుకోవాలి. ఈ నిర్వచనం ప్రకారం కుటుంబంలో ఎవరి పేరున ఉన్నా ఆభూమిని అంతా తీసి సీలింగు క్రింద జమకట్టాలి. అప్పుడు అది 3600 నికరాదాయం ఉంటుందా? లేదా? అని చూడాలి. ఆ విధంగా చేస్తేనే భూమి మిగులుతుంది. కాని దానిని అంగీకరిస్తారా అనేది ప్రధానాంశము. అయితే కళా వెంకట్రావుగారు పుట్టబోయే వారికి ఆస్తి చెందవని యిట్లు ప్రశ్నించారు. 'మరి నీ నిర్వచనం ప్రకారమైతే పుట్టబోయేవారికిగాని పుట్టి పెద్ద వారైన వారికి గూడ ఆదాయ మార్గంగాని, వృత్తిమార్గంగాని లేదే' అని ప్రశ్నించవచ్చు. అది ఆలోచించ వలసిన విషయమే. అది కేంద్ర ప్రభుత్వ కర్తవ్యం. మొత్తం భారత దేశ రాజ్యాంగాన్ని చేతిలో పెట్టుకొని అధికారం చేస్తున్న కాంగ్రెస్ పార్టీపై [illegible]మున్నది. భూములు పంచినంత మాత్రాన సమస్య పరిష్కారంకాదు. అది ఒక మొదటి మెట్టు మాత్రమే. ఇంకొక 10 ఏండ్లలోనైనా ప్రతి ఒక్కరికి పని, విద్య, వైద్య సౌకర్యాలను కలిగిస్తామని ప్రభుత్వం గ్యారంటీ ఇవ్వాలి. ఈ వేళ 20 ఎకరాల భూమిఇచ్చినా పది ఏండ్ల తరువాత అతనికి బిడ్డలు పుట్టిన తరువాత 2, 3 ఎకరాల కంటే ఎక్కువ ఉండదు; ఈ విధంగా వారిని దరిద్రులను చేసే పద్ధతి అని చెప్పడం ఈ భూస్వాములు చేసే ప్రచారానికి దోహదం చేయడం తప్ప యింకేమీ లేదు అందు చేత భూసంస్కరణలతోపాటు ఈ రోజు సమస్యలను పరిష్కరించడానికి, ప్రతి ఒక్కరికీ పని కల్పించి, ప్రతి ఒక్కరికీ విద్య, వైద్య సౌకర్యాలు కల్పించడానికి ప్రయత్నం చేయాలి. దానికి కావలసిన ఆర్థికాభివృద్ధికి, జాతీయాభివృద్ధికి పూనుకోవాలి. దానికి మొదటి మెట్టుగా మాత్రమే భూసంస్కరణలను కోరుతున్నాము. కానీ ఈరోజు ప్రభుత్వం తల ఒక్కింటికి 14,400/- రూపాయల ఫలసాయం వచ్చే భూమిని; అంటే 5 గురు ఉన్న కుటుంబాన్ని లెక్కలోకి తీసుకొంటే 72,000/- రూపాయల ఫలసాయం వచ్చే భూమిని వదులుతున్నారు. కుటుంబానికి 4,800/- రూపాయలు ఆదాయం వచ్చే భూమికి ప్లానింగ్‌కమిటీ అంగీకరించిందని మంత్రిగారు చెప్పారు. మరి ఈ 72,000 రూపాయలు నికరాదాయం వచ్చే భూమిని fix చేసే ఆలోచన ఎక్కడనుంచి వచ్చింది? ప్లానింగ్ కమీషన్ అంగీకరించిన దానికి ఈ ప్రభుత్వం అదనంగా 18 రెట్లు యిస్తోంది. ఈ భూమి ఇట్లా యిచ్చి, కుటుంబంలో యింకా ఎక్కువమంది ఉంటే, అట్టివారికి తల ఒక్కింటికి 12,00/- రూపాయలు నికరాదాయం వచ్చే భూమి యిస్తామంటున్నారు. ఇంకా కొన్ని ఖర్చుల సంగతి చెప్పారు. కళా వెంకటరావుగారు మాట్లాడుతూ, తెలంగాణా బిల్లులో మినహాయించిన పచ్చిక భూములను, పండ్ల తోటలను ఈ బిల్లులోనికి తీసుకొని రావడం జరిగిందని చెప్పారు. ఇప్పుడు వాటిని మినహాయించకుండా ప్రభుత్వం చేసింది ఏమిటని అడుగుతున్నాను. పండ్ల తోటలయొక్క ఆదాయాన్ని

నిర్ణయించడానికి, వాటి చుట్టుప్రక్కల భూములలో ఇచ్చే ఆదాయాన్ని ఆధారంగా తీసుకోవలసిందిగా చెబుతున్నాను. ఇతర రకాలుగా చూసినప్పుడు మొత్తం భూమి 15-20 Acres ఇస్తే, దానిలో 4 లేక 5 ఎంతులు పండ్లతోటలు వేసుకొనడానికి అవకాశం ఉంచి, ఆ మేరకు Ceiling ను నిర్ణయించవలసి ఉంటుంది. మామూలుగా 20 cres ఉంటే, దానిలో దాదాపు 3-4 ఎంతులు, వేసే పంటనుబట్టి తోటలు వేసుకోవచ్చు. మిగిలినది మాత్రమే Ceiling లో తగ్గిస్తామని చెప్పవలసి ఉంటుంది. కానీ అదేమీచేయడంలేదు. ఆదాయాలను మాత్రం పెంచుకుంటూ పోయారు. ఇవన్నీ చేశాక యింక భూస్వాముల వద్ద ఏమి భూమి మిగులుతుంది? బీదలకు ఏమి పంచుతారని ఎవరైనా అడుగుతారేమోనని, వెంకట్రావుగారు బంజర్లు పంచుతామంటున్నారు.

మన ఆంధ్రప్రదేశ్‌లో నూటికి 83 మంది వ్యవసాయంపై జీవిస్తున్నారు. నూటికి 57 మంది వ్యవసాయ కార్మికులున్నారు దాదాపు ఒక కోటి ముప్పది లేక ఒక కోటి నలుబది లక్షల మంది వ్యవసాయంపై జీవిస్తున్నారు. వీరందరికి భూసంస్కరణల మూలంగా నిరుద్యోగాన్ని, దారిద్ర్యాన్ని యివ్వాలని తలుస్తున్నారా? లేదయ్యా, వీరందరికి 38 లక్షల ఎకరాల బంజర్లు పంచుతామంటున్నారు. కుటుంబానికి ఒక ఎకరముమాగాణీ గాని, అయిదు ఎకరాల మెట్టభూమి గాని యిస్తామంటున్నారు. ఆంధ్ర ప్రాంతంలో 12 లక్షల ఎకరాలు, తెలంగాణాలో 20 లక్షల ఎకరాలు పంచుతామని చెబుతున్నారు. ఈ లెక్కలు ఎక్కడనుంచి వచ్చాయని అడుగుతున్నాను. ఇవి కళ్ళనీళ్ళు తుడవడానికి చెప్పే మాటలా? అని అడుగుతున్నాను. గత 25 లేక 10 సంవత్సరాల లెక్కలు చూస్తే ఆంధ్ర లో 32,35,000 Acresలో తెలంగాణాలో 8,84,000 Acres బంజరు భూములున్నట్లు తేలింది. ఆంధ్ర ప్రాంతంలో 12 లక్షల ఎకరాలు, తెలంగాణాలో 20 లక్షల ఎకరాలు పంచుతామని చెప్పారు. పై లెక్క ప్రకారం తెలంగాణాలో 20 లక్షల ఎకరాలు ఎక్కడనుంచి వచ్చింది. ఒకవేళ పొరబాటున తారుమారుగా చెప్పారు అనుకుందాము. ఈ బంజర్లన్నీ యిప్పుడు ప్రభుత్వ స్వాధీనంలో ఉన్నాయన్న "గ్యారంటీ" ఏమిటి? ఈ మొత్తం భూమి భూస్వాములక్రింద, ప్రభుత్వంక్రింద ఉన్న Cultivable waste కాని, ఒక్క ప్రభుత్వంవద్ద ఉన్నదే కాదు. ఇదివరకు ఆంధ్ర ప్రాంతంలో లెక్కలు చేసి; మొత్తం 32 లక్షల ఎకరాల బంజర్లలో 13 లక్షల ఎకరాలకంటే ప్రభుత్వ స్వాధీనంలో లేదని చెప్పారు. 1953—54 land census ప్రకారం ఆంధ్రలో cultivable waste 17 లక్షల ఎకరాలు మాత్రమేనని తేలింది. అందుచేత కళా వెంకట్రావుగారు చెప్పింది ఆంధ్రకు సంబంధించినంతవరకు కొంత నిజం. 32 లక్షల ఎకరాల బంజర్లు ఉంటే. అందులో 12 లక్షల ఎకరాలు మాత్రమే ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఉండి, యిప్పుడు పంపకానికి సిద్ధంగా ఉందన్నమాట. ఇందులో పోరంబోకులు,

పచ్చిక బీళ్ళు చేరలేదు. ఆంధ్రలో 32 లక్షల ఎకరాలలో 12 లక్షలు మాత్రమే పంపకానికి ఉంటే; ఆ 1/3 దామాషా ప్రకారం తెలంగాణాలో 3 లక్షల ఎకరాల కంటె ఎక్కువ భూమి మిగలదు. ప్రభుత్వం 32 లక్షల ఎకరాలను ఎక్కడనుంచి పంచిపెట్ట దలచింది? ఈ 15 లక్షల ఎకరాలు కూడా మెట్ట. ఇవి standard cres లోకి తీసుకుంటే 3 లక్షల ఎకరాలకంటే రావు. 26 లక్షల కుటుంబాలకు 3 లక్షల ఎకరాలను పంచడం ఒక బ్రహ్మాండమైన విషయమా? అందువల్ల బంజర్లు పంచితే సమస్య పరిష్కారము కాదు. భూస్వాముల వద్దనున్న భూమిని పంచిన నాడే ఈ సమస్య పరిష్కారమౌతుందికాని, వేరే మార్గం లేదు. బంజర్లను యిది వరకు భూస్వాములు కష్టపడి సాగులోకి తీసుకొని వచ్చారని చెబితే మేము యిప్పుడు అంగీకరించం. వ్యవసాయ కార్మికులు కష్టపడి పనిచేసి వాటిని సాగులోకి తెచ్చారు. వారికి ఈరోజు భూములు యివ్వకుండా, ఎక్కడో బంజర్లు ఉన్నాయంటే ఏమిలాభం? డెల్టా ప్రాంతంలో అసలు బంజర్లు లేనేలేవు. అటువంటివారందరిని తెలంగాణా లేక ఏజన్సీ లేక రాయలసీమ ప్రాంతాలకు పంపిస్తారా? అక్కడ బంజర్లున్నాయి, వెళ్ళి వ్యవసాయం చేయండంటే, అది అయ్యేపనా? అని అడుగుతున్నాను. ఎప్పుడో ప్రభుత్వం స్వయంగా కావలసిన పెట్టుబడి పెట్టి, యంత్రాలు పెట్టి నీరు పారుదల చేసినప్పుడు, బంజర్లన్నీ సాగులోకి వస్తాయేకాని; అవి లేకుండా ఈ రోజున కష్టపడి పండిస్తున్న బంజర్లను యిక్కడ వదలి; ఎక్కడికో వెళ్ళి సాగుచేయమంటే ఎవరు వెళతారు? ఎవరు చేస్తారు? బంజర్ల వల్ల కొన్ని స్థలాలకు కొంత ప్రయోజనం ఉన్నా, వీటి వల్ల సమస్య పరిష్కారం కాదు. భూస్వాముల వద్దనున్న అదనపు భూమి పంచినపుడే ఈ సమస్య పరిష్కారమౌతుంది. ఈ విషయాలన్నిటినీ దృష్టిలో ఉంచుకున్నప్పుడు, ఈ మినహాయింపులు ఎంత ప్రమాదకరమైనవో కనిపిస్తున్నాయి.

ఇంకా ఏవో కొన్ని బిల్లులను తేబోతున్నామని కళా వెంకటరావుగారు తెలిపారు. మన రాష్ట్రములో యితర రాష్ట్రములకంటే ఎక్కువ పెడుతున్నామని వారి పార్టీవారికి తెల్పుతూ, మావైపు తిరిగి పోలెండులో 120 ఎకరాలు, జెకోస్లో వేకియాలో 100 ఎకరాలు వుంది. కనుక మేము అట్లాగే చేస్తున్నామని మంత్రి గారు తెలిపారు. కేరళలో తరీభూమి అయితే 15 ఎకరాలని, మెట్ట అయితే 30 ఎకరాలని నిర్ణయించారు. తరీభూమి 15 ఎకరాలే వుండాలో లేక యింకా ఎక్కువ చేయాలో వారి సెలక్టు కమిటీ నిర్ణయిస్తుంది. కాని మెట్ట 30 ఎకరాలకు మించి వుండ కూడదని వారు చెప్పారు. దానివల్ల వారికి ఎక్కువ భూమి లభింపకపోవచ్చు. ఎక్కువ లభించేటట్లుగా చేయటానికి ఆ ప్రభుత్వానికి కొన్ని చిక్కులు వున్నవి. కేంద్రప్రభుత్వ సహకారము లేకుండా, భూములు తీసుకున్న వారికి యితర వృత్తి కల్పించటానికి వీలులేకుండా వుంది. దేశములో ఒక్క రాష్ట్రములో కమ్యూనిస్టు పార్టీ అధికారములో వుంటే ఆ రాష్ట్రములో నిజమైన భూసంస్కరణలు తేవటం

తేలిక అని మేము చెప్పటంలేదు. కేంద్రప్రభుత్వము సహకరించినా, సహకరించక పోయినా, మాకు వున్న పరిమితులలో మాత్రమే మేము తెస్తామని చెబుతున్నాము. కాని అలాచెప్పే అవకాశము కాంగ్రెసుపార్టీకి లేదు. ఇతర రాష్ట్రాలలోను, కేంద్రము లోను కాంగ్రెసుపార్టీ అధికారములో వుంది. అందుచేత తేదలచుకుంటే నిజమైన భూసంస్కరణలు ఆ పార్టీ వారు తీసుకురాగలరు. వారి భూమిని తీసుకొని వారి పిల్లలకు విద్య సౌకర్యాలు, వారికి వృత్తి సౌకర్యాలు కల్పించగలమని వారు ధీమాగా చెప్పవచ్చును. మంత్రిగారు పోలెండు, జెకోస్లోవేకియాల సంగతి చెప్పారు కాని, చైనా సంగతి వారు ప్రస్తావించలేదు. అచ్చట జనాభా మన దేశంలోనే ఉన్నది. అచ్చట పెట్టినట్లుగా యిక్కడ పెట్టివుంటే బాగుండేది.

శ్రీ కె. వెంకట్రావు:—అక్కడ m..ximum holding పెట్టలేదు.

శ్రీ పి. సుందరయ్య:—సీలింగ్ అనే ఇంగ్లీషు పదం ఉపయోగించలేదు కాని అక్కడ m..ximum holding పెట్టారు.

శ్రీ కె. వెంకట్రావు:—Co-operative f rms క్రింద convert జేశారు. అది పాత చరిత్ర.

శ్రీ పి సుందరయ్య:—ఎల్లకాలము దరిద్రముగా వుండటం లేదనేది పాత చరిత్ర అయితే మంత్రిగారు చెప్పినది, నిజమే అవుతుంది. ఒక కుటుంబంలో ఏ ఒక్కరు భూమిని సాగు చేసుకుంటున్నా ఆభూమిని ముట్టుకోకూడదనే సూత్రముపై ఆధారపడే చైనాలో భూ సంస్కరణలను తేవటం జరిగింది. స్వయముగా వ్యవసాయము చేసుకోకుండా, కూలీల చేత చేయించుకునే వారి భూమినే తీసుకోవడం జరిగింది. కమ్యూనిస్టుల నాయకత్వము క్రింద పరిపాలన జరిగే ప్రభుత్వముల అనుభవాలను నేను శాసనసభలో యింతవరకు తీసుకురాలేదు. మా డబ్బాను మేమే కొట్టుకో వలసిన అవసరం లేదు. మంత్రిగారు పోలెండు, జెకోస్లోవేకియాల సంగతిని ప్రస్తావించారు కనుక, నేను చైనా సంగతి ప్రస్తావించడం జరిగింది. మన రాష్ట్రము లో కూడా వారు అనుసరించిన విధానములే అమలు జరిపితే ప్రతి ఒక్కరికీ కొద్దిగానైనా భూమి లభించే అవకాశము వుంటుంది. గత అక్టోబరు మొదలు జూన్ వరకు 7 కోట్ల ఎకరాలకు చైనా ప్రభుత్వము నీటి సదుపాయములను కల్పించింది. ఈ 9 నెలలలో 10 కోట్ల మందికి వ్యవసాయ సౌకర్యములు కల్పించారు. క్రితం సంవత్సరము 20 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తిచేసిన చైనా ఈ సంవత్సరము 30 కోట్ల టన్నుల వరకు పండిస్తున్నది. ఆ విధంగా మన రాష్ట్రంలో చేస్తే నిజమైన భూసంస్కరణ వచ్చినట్లు అవుతుంది. కళా వెంకట్రావుగారు మాట్లాడుతూ తాము

యింకా చాలా బిల్లులు తేబోతున్నామని (తమ అంబుల పొదిలో యింకా అనేక అస్త్రాలు వున్నాయని) తెలిపారు. భూ సంస్కరణ బిల్లు ప్రవేశపెట్టామని, టెనెన్సీ బిల్లు, కనీస వేతనాల బిల్లును, Land Assessment ద్వారా బంజరులను పంచే బిల్లును, తెలంగాణాలో వున్న భూముల అమ్మకాలను వాలిడేట్ చేసే validation of lands sales బిల్లును, మేనేజిమెంటు బిల్లును, water rates బిల్లును, co-operative farming బిల్లును, Land Revenue Code ను సంస్కరించే బిల్లును వీటన్నిటినీ తేబోతున్నామని వారు తెలిపారు. 1955—56 లో టెనెన్సీ బిల్లు ఆంధ్ర ప్రాంతములో తెచ్చారు. దానివల్ల కొంత టెనెన్సీ సమస్యను పరిష్కరించారు. ఆ చట్టం వచ్చిన తరువాత మన కౌళ్ళను రిజిష్టరు చేసుకోక పోతే అవి కౌళ్ళుగా పరిగణింపబడవు. దాని వల్ల భూస్వాములను భూమినుంచి తొలగిస్తూవుంటే పిటీషన్ రాలేదనే కారణముతోనో, మరియింకొక కారణముచేతనో వారిని తొలగిస్తూనే వున్నారు. తెలంగాణాలో protected tenancy ఏర్పాటు చేస్తాము కదా. ఆంధ్ర, తెలంగాణా రాష్ట్రాలలో ఉన్న పద్ధతులను సమన్వయం చేస్తాము అంటున్నారు. మీరు తేబోయేది ఏమిటి? హైదరాబాదు రాష్ట్రంలో Protected Tenancy Act తెచ్చినప్పటికీ, శ్రీమన్నారాయణగారి లెక్కలను బట్టి, వారు చదివిన లెక్కలను బట్టి చూస్తే, protected tenants క్రింద నమోదైన భూమిలో నూటికి 50 ఎంతులు పోయినవని వారు చదివారు. ఖుస్రూగారి పుస్తకం నుంచి చదివారు. వారు చెప్పిన అంకెలన్నీ కూడినట్లయితే, protected tenants నూటికి 46 మంది భూమినుంచి తొలగింబడ్డారని తెలుస్తుంది. శ్రీమన్నారాయణగారి లెక్కలు కూడా యిదే విధంగా ఉన్నాయి. protected tenants గా సర్టిఫికేటు ఉండి యిదివరకు సాగు చేసుకునే వారిలోనే యింతమంది తొలగించబడ్డారంటే protected tenants గానివారు ఎంత మంది తొలగించబడ్డారో తెలియదు. ఇపుడు సమన్వయం చేస్తామంటే, తెలంగాణాలో సగంమందికైనా భూమి ఎందుకుండాలి, వారినుంచికూడా ఆంధ్రలో మాదిరే భూమిని ఊడకొడదాము, అనే ఉద్దేశంతప్ప మరొకటి కాదు.

శ్రీ కె. వెంకట్రావు:—బిల్లు వచ్చిన తరువాత కదా తెలిసేది; ఏదీ చూడకుండా ఎట్లా?

శ్రీ పి. సుందరయ్య:—ఆంధ్ర ప్రాంతంలో కౌలుదారుల రక్షణ చట్టం అనుభవం చూశాము. ఇపుడు సీలింగ్ చట్టం అనుభవము చూస్తున్నాము. చట్టం అనుభవాన్నిబట్టే మాట్లాడుతున్నాము. ఉన్న దానిలో తొర్రలుంటే పూడ్చే బదులు బాహాటంగానే యింకా అధ్వాన్నం చేస్తూంటే వచ్చే బిల్లులు యింకా చక్కగా ఉంటాయి అనుకోవచ్చును. ఏవో Land Assignment Rules వస్తున్నాయి అన్నారు. దాని ఫలితంగా సాగు చేస్తున్న వారిలో ఎంతమందిని భూమి

నుంచి తొలగిస్తారో తెలియదు. ప్రధాన మైనది భూమి పంపకం బిల్లు. భూమి లేని రైతు కూలీలకు, వ్యవసాయ కార్మికులకు ఏదో కొంత భూమి అయినా వచ్చే సంస్కరణ చాలా ముఖ్యమైనది. L nd Man gement Act అని ఒకటి తెస్తామని అన్నారు. అటువంటి చట్టాన్ని భూస్వాములు సరిగా m nage చేయక పోతే ఆ భూమిని లాక్కొని పేద ప్రజలకు యిస్తారా, లేక పేద రైతు ఎరువులు లేకనో విత్తనములు లేకనో సరిగ్గా వ్యవసాయం చెయ్యకపోతే చేయరేదని ఆ భూమిని లాక్కొని భూస్వామికి యిస్తారా; యిటువంటి చట్టాన్ని రెండు రకాలుగాను ఉపయోగించవచ్చును.

శ్రీ కె. వెంకట్రావు:—అంతా కలలు కంటున్నారు

శ్రీ పి. సుందరయ్య:—మావి కలలు; మీవి కల్లలు, వారే చెప్పారు తెలంగాణాలో భూమి సీలింగు ఎంత చక్కగా పని చేస్తున్నదో. తెలంగాణాలోని కంభం జిల్లాలో 92 వేల ఎకరాలు వస్తుంది అని అనుకుంటే లెక్కలు చూసి ఏడు వేలు అన్నారు. తరువాత 5 వేలు అన్నారు ఆఖరుకు 700 ఎకరాలు అన్నారు. ఇంకా లెక్కలు తీయాలని అన్నారు. ఆ దామాషాను చూస్తే 200 ఎకరా లుంటుందేమో. ఇదంతా ఎవరికోసము చెప్పారు? ప్రజల కోసము కాదు; మా కోసము కాదు. వారి వెనుక కూర్చున్న వారి కోసం. ఏదో బిల్లు తెస్తున్నాము, సీలింగు పెడుతున్నామని అనుకుంటారేమో; ఆ భయమేమీ వద్దు; మీ భూమి ఏమీ పోదు; కంభం జిల్లాలో 92 వేల ఎకరాలు అనుకుంటే 200 ఎకరాలేకదా వచ్చింది; ఎందుకు బాధపడతారు; మీకు ఏ రీతిగానూ భయం లేదని హామీ యిచ్చారన్నమాట. ఎక్కడా భూమి లేదంటారా. గ్రామాలకు వెళ్ళండి భూమి కనుపిస్తుంది. ఈ బిల్లు ఈ రీతిగా ఉన్నది. దీనిని పూర్తిగా సంస్కరించాలి. తగినంత విమర్శన రాకపోవచ్చును. పత్రికలలో అభిప్రాయం సరిగా సమగ్రంగా రాకపోవచ్చును, భూమి రావాలనుకునే పేద ప్రజలు కాంగ్రెసు ప్రభుత్వం ఉన్నంతకాలం మనకు భూమి రాదు; ఎందుకువచ్చిన చట్టం యిది; కాంగ్రెసు ప్రభుత్వాన్ని మార్చాలే కాని మరొకమార్గంలేదు అని అనుకుంటుండవచ్చును. విమర్శన లేదు. అంటే అందరూ అంగీకరిస్తున్నారని కాదు. అటువంటి భ్రమలో పడితే అది పొరపాటు బిల్లులో రావలసిన మార్పులు మరొక పర్యాయం చెప్పేముందు. ముఖ్యమంత్రిగారు ఇక్కడనే ఉన్నారు కాబట్టి ఒక విషయం చెబుతాను. గవర్నరుగారి ఉపన్యాసమునకు తెచ్చిన అభినందన తీర్మానంపై జరిగిన చర్చకు జవాబు చెబుతూ. ఇతర ఆదాయాలపై కూడా సీలింగు పెట్టాలనే నా ఉద్దేశం, ఆ అధికారం నా చేతులలో లేదు. ఉంటే తప్పకుండా పెట్టేవాణ్ణి అని చెప్పారు. వారు చెప్పిన ఈ విషయాన్ని మా పార్టీ దృష్టిలో పెట్టుకున్నది. ఈ అధికారం యిప్పుడు లేదు. రాజ్యాంగం మారాలనే విషయం గుర్తించాము. కేంద్రంలో కాంగ్రెసు పార్టీ అధికారంలో ఉన్నది; వారికి చెప్పి ఒప్పించాలి; ఒప్పించలేకపోతే

అది మీ బాధ్యత. అయినా మన హక్కులకు లోబడిఉన్న విషయం ఒకటి ఉన్నది. భూమి సంస్కరణలకు సంబంధించినంతవరకు మా సూచన ఒకటి ఉన్నది. ఇతర విధాలుగా, అంటే ఇండ్లు వా పారం కాని, పాక్టరీలవల్ల కాని, ప్రభుత్వోద్యోగం వల్ల కాని, ఇండ్ల అద్దె రూపేణా కాని సంవత్సరానికి 12000 రూపాయలు ఆదాయం వచ్చేవారికి సీలింగు ప్రశ్న వచ్చినప్పుడు వారికి ఒక సెంటు భూమి అయినా లేకుండా చేసి వారి భూమినంతా తీసుకొని పంచాలని మా సూచన. రు 1,000 లు ఆదాయం ఉదారంగా పెట్టినాం; నెలకు వెయ్యి రూపాయలు ఆదాయం నిర్ణయించాము అన్న మాట. ఈ సూచనకు ముఖ్యమంత్రిగారు ఒప్పుకుంటారా? మాకు అధికారమే ఉంటే చేస్తామన్నారు కదా; ఇది అధికారం ఉన్నవిషయం. శాసనసభకు అధికారం ఉన్నది, ప్రభుత్వానికి అధికారం ఉన్నది. అలా చేసినప్పుడు మా చేతిలో ఉన్నది చేశాము అని చెప్పుకోవచ్చును. ఈ బిల్లు ప్రజా నుకూలంగా చేయ వలసిన మార్పులు మరొకసారి చెబుతాను. 1. రు 5,400 లు నికరాదాయం అనేది పనికి రాదు. తెలంగాణాలో అమలులో ఉన్నట్లు, ప్లానింగ్ కమీషన్ వారు అంగీకరించినట్లు, దేశంలో అందరు ఆశించినట్లు, భూమి లేని వారికి ఏ కొంచెమైనా భూమి వచ్చేటట్లుగా రు 3,600 లు నికరాదాయం వచ్చే భూమిని కుటుంబ కమతంగా ఉంచాలి. 2. కుటుంబం అంటే భార్య, భర్త, పెండ్లికాని కూతురు, మైనార్టీ తీరని కొడుకు, వారిమీద ఆధారపడే తల్లి దండ్రులు; అంతేకాని మరొక దానినీ దేనిని కుటుంబం క్రింద పరిగణించము. వారిలో ఎవ్వరి పేరుతో భూమి ఉన్నప్పటికినీ కుటుంబ కమతం క్రిందనే వస్తుంది 3. నికరాదాయం తేలునప్పుడు ఖర్చులకు సగం అన్న లెక్క పనికి రాదు. సామాన్యంగా నల్లరేగడి భూములలోను, ఎనిమిది నెలలకు పైగా నీటి వసతులుండే భూములలోను, నాలుగవ వంతు, ఇతర భూములలో మూడవ వంతు కంటే ఖర్చుల క్రింద తీసుకోవ డానికి వీలులేదు. 4. పచ్చిక బీళ్ళు అనేవి సీలింగులో భాగంగా ఉండాలే కాని ప్రత్యేకంగా ఉండడానికి వీలులేదు. మనుష్యుల సంగతి ఏమైనా పశువులు ప్రధానం అనే పద్ధతి పోవాలి. సీలింగు లోపలనే ఏరకమైన లోపము లేకున్నా, rotation crops వేసుకున్నా, వాణిజ్యపంటలు వేసుకున్నా, అవసరమైన బీడు ఏర్పరచుకున్నా మేతకు కావలసిన బీడు కూడా సీలింగులో భాగమై ఉండాలి. వేరే ఉండరాదు. 5. పండ్ల తోటల విషయంలో ఇప్పటి పద్ధతిపోయి, వాటినుంచి వచ్చే ఆదా యాన్నికూడా కొంతవరకైనా తీసుకొని సీలింగు విస్తీర్ణాన్ని తగ్గించాలి. వీటిని మీరు అంగీకరించి సీలింగు 3,600 రూపాయలు నికరాదాయం వచ్చే భూమి అని అంగీక రించితే, పెద్ద కుటుంబాల విషయంలో అదనంగా ఉండే మనుష్యులు తలకు రు 600 లు చొప్పున మొత్తం నికరాదాయం రు 5,400 లకు మించకుండా భూమిని సీలింగుగా నిర్ణయింపవచ్చును. పెద్ద, చిన్న కుటుంబాలు అనే తేడా లేకుండా ఉండా

అని నేను చెప్పడం లేదు. వెనుక చెప్పినట్లు, యితరత్రా ఆదాయం 12 వేల రూపాయలకు మించిఉన్న వారికి వేరే భూమి ఉంచవలసిన పని లేదు. భూకమతాలకు గరిష్ఠపరిమితి నిర్ణయించి శాసనాలనుంచి తప్పించుకునే తలంపుతో చాలమంది భూస్వాములు బినామీ ట్రాన్స్‌ఫర్ చేశారు. ఎన్నో అనా క్రాంతాలు, దాన విక్రయాలు జరిగాయి. చల్లపల్లి రాజాగారు ఎంతో భూమిని అమ్ముకున్నారు. గోటేటి రాఘవదాసుగారు పశ్చిమగోదావరి జిల్లాలో రెండు పంటలు పండే భూమిని 13 వేల ఎకరాల వరకు అమ్ముకున్నారు. ఈ అమ్ముకున్నవాళ్ళ దగ్గర నుంచి ఏవిధంగా డబ్బు వసూలు చేసుకోవాలో ప్రభుత్వం ఆలోచించవలసి యున్నది 1957 వ సం॥రం సెప్టెంబరు తరువాత ఏ భూస్వామి అయినా భూమి అమ్ముకున్నట్లయితే దానిని కూడా గరిష్ఠ పరిమితిగా ఉంచుకొనవలసిన భూమిగా లెక్కలోకి తీసుకోవాలి. 1957 సెప్టెంబరు తరువాత ఎంత భూమి ఉన్నదో, దానిలోనుంచి సీలింగుగా నిర్ణయించే భూమిని మినహాయించి మిగతాదానినంతను ప్రభుత్వము స్వాధీనపర్చుకోవాలి. అయితే వేలం, వందలు ఎకరాలు అమ్ముకొన్నవారి నుంచి ఏవిధంగా వసూలు చేయడమనే ప్రశ్న ఉత్పన్నము కావచ్చు. అటువంటివారి విషయమై నేనొక సూచనచేస్తున్నాను. ఏ ధరకు భూమిని యితరులకు అమ్మినట్లు దస్తావేజులలో ఉంటుందో, ఆ మొత్తాన్ని యీ భూస్వాములకు యివ్వవలసిన నష్ట పరిహారంనుంచి మినహాయించినట్లయితే ప్రభుత్వానికి ఎంతోడబ్బు మిగులుతుంది. ఈ విధంగా మిగిలిన డబ్బుతో ఎన్నో ప్రాజెక్టులు నిర్మించుకోవలసి ఉంటుంది. ఉపాధ్యాయులు, ఎన్. జి. ఒ. లు మొదలగువారికి కొంత జీతం పెంచవచ్చు.

ఇక నష్టపరిహారం యిచ్చే విషయం గమనించండి. దీనిలోకూడా ప్రభుత్వం భూస్వాములకే లాభం చేకూర్చిపెట్ట దలచినది. మీ భూమిని మార్కెటు ధరకు కొనుక్కుంటాము సుమా అని భూస్వాములకు అభయ మీయబడింది. నికరాదాయమునకు 10 రెట్లు నష్టపరిహారముగా నిర్ణయించబడింది. ఒక ఎకరము భూమికి 200 రూపాయలు నికరాదాయ మైనట్లయితే 2000 రూపాయలు నష్ట పరిహారం చెల్లించాలన్న మాట. దీని అర్థం బజారుధరకు భూమిని ప్రభుత్వం కొనదలచిందని. డెల్టాప్రాంతాలలో కొన్నిచోట్ల ఎకరము 3 నుంచి 5 వేలవరకు ఉండవచ్చు. అట్టి భూములలో నికరాదాయము కూడ హెచ్చుగా ఉంటుంది. దాని ననుసరించి యీయవలసిన నష్టపరిహారం కూడ హెచ్చవుతుంది. నికరాదాయానికి 10 రెట్లు నష్టపరిహారం చెల్లించనందువల్ల భూస్వామికి లాభమేకలుగుతుంది. గాని నష్టమేమీ రాదు. ప్రభుత్వం చెల్లించవలసిన నష్టపరిహారంతో మార్కెటు ధరకు భూమి కొనవచ్చు. రాజ్యాంగచట్టములోని 31 వ ఆర్టికల్ రీత్యా తక్కువ నష్టపరిహారం చెల్లించి పెద్ద భూస్వాముల దగ్గరనుంచి భూమిని స్వాధీనపర్చుకునే అవకాశాలుండగా దానిని కాదని మార్కెటు ధరలకు భూస్వాములవద్దనుంచి భూములు కొనదలచటం ఏ విధముగా దేశానికి గాని, రైతులకుగాని లాభదాయకమో గమనించగోరుతాను

శ్రీ జి. రామస్వామిరెడ్డి:— అధ్యక్షా, యీ భూసంస్కరణల బిల్లుమీద నా అభిప్రాయాన్ని యీ సభావేదికనుంచి తెలియచేస్తున్నాను. ప్రస్తుత పరిస్థితులలో ఈ భూసంస్కరణలను ప్రవేశపెట్టడం మంచిది కాదని నా ఉద్దేశం. రైతు పండించే ధాన్యాలకు కనీసధరలు నిర్ణయించనంతవరకూ యిటువంటి సంస్కరణలు తీసుకురావడం మంచిదికాదు. ఈ బిల్లుపై శ్రీ సుందరయ్యగారు దాదాపు ఒకటి న్నర గంటలసేపు ఉపన్యసించారు. వారి ఉపన్యాసంలో చాలాసేపు వ్యవసాయ కూలీల యిక్కట్ల గురించే ముచ్చటించారు. వ్యవసాయ కూలీలకు ఎట్టి సదుపాయాలు కలిగించినా నా కభ్యంతరం లేదు. రైతుకూ, వ్యవసాయ కూలీకి సరైన సంబంధం ఉండాలని వారు చెప్పవలసిన పనిలేదు. ఈనాడు ఒక్కొక్క రైతు యింట్లో ఒక్కొక్క వ్యవసాయ కూలి తనయొక్క అభీష్టానుసారం పెత్తనం చెలాయిస్తు న్నాడు. రైతుకు, వ్యవసాయకూలీకి అన్యోన్యమైన సంబంధాలున్నాయి. భూ కమతాలకు గరిష్ఠపరిమితి తక్కువ పెట్టమని వారు చెప్పారు. కేరళ రాష్ట్రంలో ఒక పంట పండే పల్లపుభూములు 22 1/2 ఎకరాలు, రెండు పంటలు పండే పల్లపు భూములు 15 ఎకరాలు, మెరక భూములు 30 ఎకరాలుగా గరిష్ఠ పరిమితిగా నిర్ణయించారు. కేరళ రాష్ట్రంలోని భూములలో లవంగాలు, ఏలకులు, మిరియాలు వంటి విలువైన పంటలు పండిస్తారు. ఆ భూములమీద వచ్చే నికరాదాయము చాల హెచ్చు. కేరళ ప్రభుత్వంవారు సూచించిన గరిష్ఠ భూముల పరిమితిని ఆ భూములపై వచ్చే ఆదాయాన్ని దృష్టిలో పెట్టుకుని పరికించినట్లయితే మన ప్రభుత్వంవారు తెచ్చిన యీ బిల్లు ఎంతో ప్రోగ్రెసివ్‌గా ఉన్నదని, ఎంతో విప్లవాత్మ కంగా ఉన్నదని నా అభిప్రాయం.

ఈ బిల్లులోని పై నిబంధనలు చూసినట్లయితే ప్రభుత్వం బూటకపు భూ సంస్కరణలను తేదలచ యత్నిస్తున్నదే కాని, భూమిలేని పేదలకు భూమిని పంచి పెట్టడంగాని, వ్యవసాయ రంగంలో సాంఘికన్యాయం కలుగజేయడంగాని గ్రామీణ ఆర్థిక వ్యవస్థలోగల వ్యత్యాసలను తొలగించడంగాని వారి అభిప్రాయమైనట్లు నాకు బోధపడడం లేదు. ఏ పరిస్థితులలోను నష్ట పరిహారం నికరాదాయానికి 4 రెట్లు మించరాదు. గరిష్ఠ పరిమితిపైన ఒక సీలింగుకు మించని భూమి ఉన్నట్లయితే అట్టి వారికి నికరాదాయముపై 4 రెట్లు, రెండు సీలింగులకు మించనివారికి 3 రెట్లు. 3 సీలింగులు మించనివారికి 2 రెట్లు, అంతకు మించిన భూమి ఉన్నవారికి ఒక పాలు నికరాదాయమునకు మించకుండాను నష్టపరిహారంగా చెల్లించినట్లయితే బాగుంటుంది. దీనివల్ల గ్రామీణ ఆర్థిక వ్యవస్థలోగల తారతమ్యాలను ఒక క్రమ పద్ధతిన స్థిరీకరించిన వాళ్ళ మౌతాము. ఈ నష్టపరిహారం ప్రభుత్వమే చెల్లించ నక్కరలేదు. భూమి సాగు చేసుకుంటున్న రైతు దీర్ఘ కాలంలో అంటే 20 ఇన్‌స్టాల్‌మెంట్సులో తీర్చుకునే ఏర్పాటు చేయాలి. ఇట్టి ఏర్పాటువల్ల ప్రభుత్వానికి ఎంతో వ్యయం తక్కువౌటమే

కాకుండా అధికాహారోత్పత్తి సాధించటానికి అవకాశ ముంటుంది. భూమిలేని పేదవారికి భూమిని పంపకం చేయటానికి అనువైన పరిస్థితులు ఏర్పడుతాయి. అంతేకాని యీ బిల్లులోని నిబంధనలను బట్టి భూసంస్కరణలను అమలుపర్చలేము. కడకు పేద ప్రజానీకానికి పంచటానికి భూమి మిగలదు. ఈ బిల్లు వల్ల దేశంలో అసంతృప్తి, అలజడి యథాతథంగా సాగుతవే గాని వ్యవసాయ రంగంలో శాంతి నెలకొల్పడం సాధ్యంకాదు. పదేళ్ళ తర్జన భర్జనల తరువాత ప్లానింగ్ కమీషన్ వారి నివేదిక అనంతరము, ఎన్నో కమిటీలు పరిశీలనా, పునఃపరిశీలనలు చేసిన తరువాత వెలువడిన యీ బూటకపు భూ సంస్కరణలు రైతాంగాన్ని, పేద ప్రజానీకాన్ని మభ్యపెట్టజాలవని మనవిచేస్తున్నాను. కాంగ్రెసు పార్టీలోని భూస్వాములు నిజమైన భూ సంస్కరణలకు వ్యతిరేకిస్తే వారిని కాంగ్రెసు పార్టీనుంచి తొలగించవలసినదే కాని కాంగ్రెసుపార్టీ అంగీకరించిన సూత్రాలకు విరుద్ధముగా నిష్ప్రయోజనకరమైన యీ బిల్లును తీసుకొనివచ్చి భూ సంస్కరణల ఆశయాలను నీళ్ళు కార్చవద్దని కోరుతున్నాను.

ఇక ధరలు నిర్ణయించే విషయం ఆలోచించవలసి యున్నది. సగటు ధరల నిర్ణయించడానికి పదేళ్ళ మార్కెటు ధరలను లెక్కలోనికి తీసుకోవాలని చెప్పారు. దీనివల్ల హెచ్చుభూమిని భూస్వాములకు కట్టబెట్టే ప్రయత్నంజరుగుతుంది. కొందరు కాంగ్రెసువాదులు 1938 వ సం॥రం నుంచి నేటి వరకూ ఉన్న ధరల సగటును బట్టి నికరాదాయమును లెక్కచూసి గరిష్ఠ పరిమితిని నిర్ణయించమని చెప్పవచ్చు. దీనివల్ల యింకా ఎక్కువభూమి భూస్వాముల చేతులలోనికి పోతుంది. బహుశా యీ పరిస్థితినుంచి తప్పుకునే నిమిత్తమే శ్రీ కళా వెంకట్రావుగారు వెనుకటి పది సంవత్సరముల ధరలను మాత్రమే లెక్కలోకి తీసుకుంటామని చెప్పారు. ఈ బిల్లువల్ల పంపకానికి మిగిలే భూమి నామ మాత్రంగా ఉంటుంది. భూమిలేని 140 లక్షల పేద ప్రజలకు మనం చేయగల సహాయం శూన్యం. అందువల్ల నేను చేసిన సూచనలను దృష్టిలో ఉంచుకొని భూస్వాముల చేతులలోనుంచి ఎక్కువభూమిని స్వాధీనంచేసుకొని వ్యవసాయకూలీలకు, యితర చిన్నరైతులకు తలకొక ఎకరమో, రెండెకరాలో భూమి ఉండేటట్లుచేయమని కోరుతున్నాను. అపుడే దేశం ఆహార రంగంలో స్వయం సమృద్ధంగా ఉంటుందని మనవి చేస్తున్నాను. వారు కేవలం యిక్కడ వారిని విమర్శించటమే దృష్టిలో పెట్టుకొని, ఉపన్యాసం చెప్పారు. వారు యీ ఉపన్యాసాన్ని కేరళలో చేసిఉంటే బాగుండేది. ప్రభుత్వం ఈ నాడు తీసుకు వచ్చిన బిల్లు లోగడ తెలంగాణాలో ఉన్నచట్టంకంటె చాలా ప్రోగ్రెసివ్‌గా ఉన్నదని నా ఉద్దేశము. తెలంగాణా చట్టంలో 3,600 రూపాయలు గరిష్ఠ ఆదాయముపెట్టగా, యీ బిల్లులో 5,400 రూపాయలు గరిష్ఠ ఆదాయము పెట్టారు. అంటే ఈ బిల్లులో పరిమితి ఎక్కువ ఉంచబడింది. కానీ, తెలంగాణా చట్టంలో రైతు వెల్ మేనేజ్డ్

ఫారమ్స్ క్రిందగాని, ప్రోగ్రెసివ్ ఫార్మర్స్‌గా గాని, తప్పించుకొనే దానికి అవకాశా లున్నాయి. ఇప్పుడు తీసుకువచ్చిన యీ బిల్లులో ఆవిధంగా తప్పించుకొనేదానికి అవకాశం లేదు. ఈ బిల్లులో ఆదాయము యొక్క పరిమితిని ఎక్కువచేసి, వ్రాసి దారిన లెక్కలుచూపి తప్పించుకొనే పద్ధతి తొలగించారు. ఇది యీ బిల్లులో గల ముఖ్యమైన విషయము. యిది కొంతవరకు అభివృద్ధికరమైన విషయము. మన ఉద్దేశం నెరవేరేదానికి యీ బిల్లు తోడ్పడుతుందని చెబుతూ, యిది చాలా ప్రోగ్రెసివ్‌గా ఉన్నదని నేను భావిస్తున్నాను. ఐదుగురు సభ్యులుగల ఒక కుటుంబానికి ఏర్పరచిన సీలింగ్ కాక, ఆ కుటుంబంలో ఐదుగురికి మించి సభ్యులు ఉన్నట్లయితే తలాఒకరికి 1,200 రూపాయలు ఆదాయంవచ్చే భూమిని ఉంచుకోవచ్చునని యీ బిల్లులో సూచించారు. మొదట కుటుంబంలో ఉందేది ఒకరే కావచ్చును. రేపు అతడు వివాహం చేసుకున్న తర్వాత, అతనికి పిల్లలు పుట్టవచ్చును. కాబట్టి యీ విధంగా బిల్లులో ఏర్పాటుచేయటం కూడా న్యాయమైన విషయమే. కాని, రైతు పండించే పంటలయొక్క ధరలను స్థిరీకరణ చేసినతర్వాత ప్రభుత్వం యీ సీలింగ్ పెడితే బాగుండేది. అయినప్పటికీ, ప్రభుత్వం తొందరగా రైతులయొక్క పంటల ధరలను స్థిరీకరణ చేసేదానికి తగిన సత్వరమైన చర్యలు తీసుకోవాలని నా ఉద్దేశము. దీనితోపాటు యితర ఆదాయాలనుకూడ సంస్కరించడం చాలా ముఖ్యమైనవిషయం. ఈ నాడు దేశంలో బ్రహ్మాండమైన ఫ్యాక్టరీ ఓనర్స్ ఉన్నారు. పారిశ్రామికులు ఉన్నారు. అనేక రంగాలలో, అనేక మంది వ్యాపారస్థులు కోటాను కోట్ల రూపాయలు సంపాదించుకొంటున్నవారు ఉన్నారు. వారియొక్క ఆర్థిక వ్యవస్థను రైతుల యొక్క ఆర్థిక వ్యవస్థను పోల్చి చూసుకుంటే, రైతులయొక్క ఆర్థిక స్థితిని చాలా వెనక్కు పగ్గాలుపెట్టి మనం లాగినట్లు ఉన్నది. ఈ నాడు కేవలం రైతే మన కళ్ళ యెదుట కనుపిస్తున్నాడు. పెద్ద పెద్ద పారిశ్రామికులయొక్క, వ్యాపారస్తుల యొక్క, ఫ్యాక్టరీ ఓనర్సు యొక్క ఆర్థిక వ్యవస్థతో రైతు యొక్క ఆర్థిక వ్యవస్థ పోల్చి చూసుకుంటే రైతుయొక్క ఆర్థిక వ్యవస్థ చాలా తక్కువగా ఉన్నది. రైతుయొక్క ఆర్థిక వ్యవస్థ వారితోబాటు సమానంగా ఉండాలంటే, అన్ని సంపదలను మనం సంస్కరించి, ప్రజలలో, సమాజంలో న్యాయం కలుగజేయ వలసి ఉన్నది. ఇది చాలా ముఖ్యమైన విషయము.

తరువాత, మనము ఇన్‌టెన్‌సివ్ ఎగ్రికల్చర్‌ను ప్రోత్సహించాలంటున్నాము. కేంద్రీకృత వ్యవసాయాన్ని ప్రోత్సహించాలంటే, రైతులకు ఈ నాడు అవకాశం దొరకటంలేదు. ముఖ్యంగా ఇంటెన్‌సివ్ ఎగ్రికల్చర్ మనం ప్రోత్సహించాలంటే, వారికి కావలసిన అభివృద్ధి కరమైన ఎరువులు, వ్యవసాయ పరికరములు సప్లయిచేసి, లోన్సు యివ్వవలసి ఉన్నది. అవన్నీ మనము రైతాంగానికి సకాలంలో అందజేసి

పరిస్థితిలో మనము లేము. ఈనాడు అమ్మోనియా సల్ఫేటుకు ప్రభుత్వం నిర్ణయించిన రేటు 36 రూపాయలు, 38 రూపాయలు వుండగా బ్లాక్ మార్కెట్‌లో 45 అమ్మటం వల్ల రైతులకు చాలా కష్టంగా ఉన్నది. రైతులు వ్యవసాయ ఖర్చులు భరించలేని యీ పరిస్థితులలో ప్రభుత్వం రైతాంగానికి అన్ని సౌకర్యాలు, వసతులు కలుగజేసి, సీలింగ్ పెట్టి, యింకా ప్రొగ్రెసివ్‌గా యీ బిల్లు తీసుకువస్తే ఎవరికీ అభ్యంతరంలేదు. అసలు రైతులు పండించే పంట అనేక వాతావరణ పరిస్థితులపై ఆధారపడి ఉన్నది. వరదలవల్ల, అతివృష్టివల్ల, చీడపురుగులవల్ల రైతు వ్యవసాయ ఉత్పత్తికి తగిన శ్రద్ధ వహించటానికి అవకాశం లేకుండా ఉన్నది ప్రభుత్వం ముఖ్యంగా యీ సీలింగ్ పెట్టేముందు, రైతులకు సరైన విత్తనాలు, ఎరువులు యివ్వటంలో ఎక్కువ శ్రద్ధ తీసుకొని రైతాంగం అధికాహారోత్పత్తి చేసేదానికి ప్రోత్సహించవలసి ఉంటుంది. ఇవన్నీ లేకుండా ప్రభుత్వం యీ సీలింగ్ పెట్టటం భావ్యం కాదు. దీనితోపాటు అన్ని సంపదలమీద కూడ సీలింగ్ పెట్టటం చాలా ముఖ్యము. ఈ సీలింగ్ పెట్టిన తరువాత, అనేక విధాలుగా యిదివరకటినుండి అమలులో ఉన్న వాణిజ్య పంటలమీద పన్నులను రద్దుచేయాలి. ఇదివరకు అమలులో ఉన్న పన్నుల విధానాన్ని మనం సక్రమంగా సవరించి, వాణిజ్య పంటలమీద పన్నులను ఎత్తివేయటం చాలా అవసరం. నికర ఆదాయాన్ని ఆధారం చేసుకొని యీ సీలింగ్ పెట్టాము. రైతులు ఆ భూమిపై అనేక వాణిజ్య పంటలు పండించు కోవచ్చును. మనం హోల్డింగ్స్ చేస్తున్నాం కాని, ప్రొడక్షన్‌యొక్క ఆదాయాన్ని అరికట్టటంలేదు. అని యిందాక మంత్రిగారు చెప్పారు. ఈ హోల్డింగ్స్ వచ్చిన తర్వాత ఇంటెన్‌సివ్ కల్టివేషన్‌తో ఎంతైనా ఆదాయం తెచ్చుకోవటానికి ప్రయత్నించ వచ్చునని వారు చెప్పారు. వారు చెప్పిన ఆ సిద్ధాంతానికి అనుగుణంగా యీ వాణిజ్య పంటలమీద పన్నులను, ఇతరవిధాల వేసే పన్నులను రద్దుచేయాలని చెబుతూ, నాకు యీ అవకాశం యిచ్చినందుకు అధ్యక్షులకు ధన్యవాదములు తెలియ జేస్తూ ముగిస్తున్నాను.

శ్రీ బి. వి. శివయ్య (మార్టూర్):—అధ్యక్షా, ఎంతోకాలంనుండి. యీ భూసంస్కరణలు తీసుకురావాలని అన్ని రాజకీయ పార్టీలు చెబుతున్నవి. ఈ ఎన్నికల ప్రణాళికలోనేకాదు, ఇంతకు ముందు రెండుమూడు ఎన్నికల ప్రణాళికలలో కూడ యీ ఆశయాన్ని నెరవేర్చాలి అని చెప్పుకోవటం తటస్థించింది. క్రమేణా జమీందారీ అబాలిషన్, ఇనాందార్లను రద్దుచేయటం జరిగిన తర్వాత, యీనాడు పెద్ద భూస్వాములను తగ్గించి, భూమిలేనివారికి భూవసతి కల్పించాలనే సిద్ధాంతాన్ని అమలుజరపాలనే నిర్ణయానికి వచ్చారు. ఇప్పటికైనా ఆ నిర్ణయము తీసుకొన్నందుకు చాలా సంతోషము. దాదాపు పది సంవత్సరాలనుండి (అంతకు పై నుండి కూడ) భూసంస్కరణలు తీసుకురావాలి అనేదానికి వెనక ఉన్న ఆశయం ఏమిటి అన్నది

ఆలోచిస్తే ఒక విషయం మాత్రం గోచరిస్తుంది. సంఘంలో స్వేచ్ఛగాను, స్వాతంత్ర్యం అనుభవించేరీతిగాను తనయొక్క పరిపాలనా, తనయొక్క సాంఘిక అవసరాలు రూపొందించుకొనటానికి, నెరవేర్చుకొనటానికి, యీ భూమిలేనివారికి అసలు జీవనాధారం లేనివారికి అవకాశం లేకుండా పోతున్నది. భూములు ఉన్నవారికి, భూములు లేనివారికి ఉన్నటువంటి తేడా యిది. అందువల్ల మనం భూమిలేనివారికి భూవసతి కల్పిస్తే (ఎకరం అయినా, రెండు ఎకరాలు అయినా) వాళ్ళు వాళ్ళకాళ్ళ మీద నిలద్రొక్కుకొని, జీవనాధారం కలిగి ఉండేవారికి కొంత అవకాశం కలుగజేసిన వారము అవుతాము. వారియొక్క పరిపాలనా విధానంలోగాని, సాంఘిక విషయాలలోగాని వారు స్వయంనిర్ణయం చేసుకునే అధికారం వారికి లభింపజేయాలనే సిద్ధాంతం ఆశయం యీ భూసంస్కరణల వెనక ఉన్నది అనే విషయం మనకు గోచరిస్తుంది. అందువల్ల మన ఉద్దేశాన్ని ఎంతవరకు యీ బిల్లుద్వారా మనం నెరవేరుస్తున్నాము. అన్నది ఆలోచించవలసిన అవసరము ఎంతైనా ఉన్నది. భూసంస్కరణల బిల్లును త్వరలో తీసుకురాబోతున్నామని, యీ ప్రభుత్వము, యింతకుముందు ఆంధ్రరాష్ట్రంలో ఉన్న ప్రభుత్వం పదేపదే చెప్పటం జరిగింది. తరువాత 1957వ సంవత్సరం సెప్టెంబరు 27వ తేదీన ఒక ఆర్డినెన్సు ప్రకటించారు. 2 ఎకరాల భూవసతికి మించిన వారంతా, వారియొక్క భూముల వివరాలు ప్రభుత్వానికి తెలియజేయాలని అన్నారు. "భూసంస్కరణలు తీసుకురావటానికి భూముల కమతాల లెక్కలను సేకరించవలసిన అవసరం ఉన్నది. భూసంస్కరణల బిల్లు తీసుకురావటం కొరకే యీ లాండ్ సెన్సస్ బిల్లు తెస్తున్నాము అని ఆ లాండ్ సెన్సస్ బిల్లు ఆబ్జక్ట్స్ అండ్ రీజన్స్‌లో పేర్కొన్నారు. ఆ బిల్లు వచ్చిన తర్వాత, ఆంధ్రా ఏరియాలో రిజిస్ట్రేషన్ డాక్యుమెంట్స్ ఎక్కువైనాయి. వాలంటరీ సరండర్సు, వాలంటరీగా దానదత్తాలు, పంపకాలు చాలా విపరీతంగా పెరిగిపోయినాయి.

మనము ఈ బిల్లులో ఉన్న క్లాజులను అన్నీ పరిశీలించి చూస్తే, ఇదివరకు జరిగిపోయిన పంపకాలు అన్నీ అంగీకరిస్తూ దీనిని Ceiling on Agricultural holdings ను గురించిన బిల్లు అని చెప్పేదానికంటే, Confirmation of Land holdings ను గురించిన బిల్లు అని ఎక్కువగ అర్థం అవుతున్నదని ప్రజలు అనుకుంటున్నారు. ఆవిధముగ అనుకోటానికి అవకాశము లేకపోలేదు. ఎందుకంటే Land holdings ను గురించిన బిల్లును తీసుకవస్తామని ప్రకటించిన తరువాత హిందూ కుటుంబములలో ఉన్న ఒక సంవత్సరం బిడ్డ కానివ్వండి, ఆరునెలల బిడ్డ కానివ్వండి, అంతకు పైన వయస్సుగల బిడ్డ కానివ్వండి, మేజరు కానివ్వండి వారందరి పేరట పంపకాలు చేసుకోవడము జరిగిపోయింది. హిందూ లా ప్రకారము మైనరుగాని, మేజరుకాని మగబిడ్డఅయి ఒక కుటుంబంలో పుట్టిన తరువాత, అతడు తండ్రికి ఉంటున్న ఆస్థిలో భాగము తీసుకోవడమనేది అతని జన్మ హక్కుగా

వీర్పడినప్పుడు, అతడు పంపకము చేసుకోవటము తప్పా అనే ప్రశ్న లేకపోలేదు కాని మనము ఈ సీలింగ్సు పెట్టబోయేటప్పుడు కుటుంబంలో ఉన్నవారు మైనర్లు గాని, మేజర్లుగాని ఈ బిల్లు ఏ సంవత్సరములో ఏ తేదీనుంచి అయితే అమలు జరుపదలచుకున్నామో ఆ తేదీన ఆ కుటుంబంలో ఉన్నవారందరినీ కలిపి అది ఒక కుటుంబముగా నిర్ణయించి, దానికి ఇంత భూమి ఉండాలి అని సీలింగు పెట్టి, అది పోగా మిగిలిన భూమిని మాత్రమే, భూమి లేనటువంటి వారికి పంచవచ్చును. అని పెట్టితే దానికి Hindu L w ఏ విధంగాను అడ్డమురాదు, అని కొంతమంది అనుకొంటున్నారు. తరువాత ఈ బిల్లును ప్రవేశపెట్టేటప్పుడు కనీసము మన ఆంధ్ర దేశములో పెద్దపెద్ద భూకమతాలు ఉన్నవారి దగ్గరనుంచి ఎంత వరకైతే భూమిని సర్దుబాటు చేయగలుగుతామో, ఆ భూమిని భూమిలేనటువంటి వారికి భూవసతి కల్పించవచ్చు. అదికూడ ఎవరైతే self cquirel cl sses గా ఉండగలిగిన వారుగా ఉంటారో స్వతంత్రజీవనము చేయటానికి ఎవరికాళ్ళమీద వారు నిలబడగలవారుగా ఉంటారో వాళ్ళందరికీ భూవసతి కలుగజేయటానికి బిల్లును తీసుకునిరావటానికి ప్రభుత్వము ఆలోచించి ఉండవలసింది. అలాంటి విధానము ఆలోచించినట్లయితే, దానికి ఒక లక్ష ఎకరాలో, రెండులక్షలో, మూడు లక్షలో కేటాయించి, సీలింగు పెట్టి పంపటానికి ఆస్కారము దొరికేది. కాని ప్రభుత్వం ఆప్రకారము ఆలోచించ లేదు. ఇప్పుడు ఈ బిల్లు ప్రకారము అయితే చిత్తులెక్కల ప్రకారమైనా కనీసము ఒక లక్ష ఎకరాలు అయినా దొరికేటట్లు కన్పించదు. ఇలాంటి గొప్ప విప్లవాత్మకమైన బిల్లును ప్రభుత్వం తీసుకువచ్చి అమలు జరపాలని ఉద్దేశించినప్పుడు ప్రజలలో చాలామంది యిబ్బంది పడవలసి వస్తున్నది. ఈ విధంగా భూమిని సేకరించేటప్పుడు ప్రభుత్వం compens tion యిచ్చుకోవాలి. ఈ సొమ్ము మొత్తము అంతా లెక్కవేస్తే లక్షల కొలది ఖర్చు ప్రభుత్వానికి ఉండదా అంటే, తప్ప కుండా ఉంటుంది. ఈ విషయమును గురించి bill యొక్క objects and reasonses గాని; fin nci l memorandum లో గాని ప్రభుత్వం ఉజ్జాయింపుగా నైనా ఉదహరించ లేదు. ఇప్పుడు ఈ బిల్లు ప్రకారము ప్రభుత్వం అమలు జరిపే టట్లయితే, పెద్దగా భూమి ఏమీ మిగలదు. కాబట్టి ఇలాంటి శాసనము, తీసుకొని రావటానికి అవకాశము, అవసరము ఏమి కల్పించడము లేదు. కాబట్టి యిలాంటి సంశయములను తీర్చడానికి, భూమి లేనటువంటి వారికి భూవసతి కల్పించి, self acquired cl sses గా తయారు చేయటానికి ప్రభుత్వం ఏ విధముముగ చేయగలుగుతుందో అర్థము కాలేదు. ప్రభుత్వం భూమిలేనటువంటి వారికి భూవసతి కల్పిస్తామని చేస్తున్న వాగ్దానాలను త్రికరణశుద్ధిగా ఏవిధముగ తీర్చగలదో నిష్కర్షగా చెప్పవలసి యుంటుంది. ఈ బిల్లునుబట్టి చూస్తే అలాంటి వాగ్దానాలు ప్రభుత్వం తీర్చగలదని నమ్మకము కలుగడం లేదు.

తరువాత సీలింగు విషయము ఒకటి ఉన్నది. 5,400 రూపాయలు గరిష్ఠ పరిమితిగా నిర్ణయించారు. అది 5,400 కాని, 6,000 కాని 3,600 కాని, ఎంత అయినా పెట్టవచ్చు, కాని ఈ సీలింగు నుంచి తప్పించుకోవడానికి దొడ్డి దోవ మార్గము లేకుండా చేయాలి. దొడ్డి దోవ మార్గముల ద్వారా రాబడి సంపాదించుకుని కుటుంబములో చాటుగా ఆస్తులు నిలబెట్టుకోటానికి తావు లేకుండా చూడాలి. అలాంటి విధానమును అరికట్టే ప్రయత్నము ప్రభుత్వం చేయకపోతే ఈ బిల్లును తెచ్చిన ప్రయోజనము ఉండదు. కాని ఈ బిల్లును బట్టి అలాంటి దొడ్డి దోవ మార్గాలు అనేకము కల్పిస్తున్నవి. దానికి బిల్లులోనే తగిన కట్టు దిట్టములు కలుగ చేయాలి. ఈ బిల్లులోని 16 (2) క్లాజును చదివితే ఏమి ఉన్నదంటే:—

Cl. 16(2) Whede a person who is a member of a joint Hindu family, holds land as separate property and has also interest in the land held by the joint Hindu family, the aggregate of the land held by him as separate property and the share of the land held by such family that would have been allotted to him if a partition of such land had taken place, shall be taken into account for the purpose of calculating his holding and for furnishing any declaration of his holding under this Act.

Land Census ను గురించి Ordinance ను ప్రభుత్వం ప్రకటించిన తరువాత పెద్ద పెద్ద భూస్వాములు కుటుంబములలోని వారి అందరి పేర, యింకా యితరత్రావారి యొక్క సన్నిహితులపేర పంపకములు చేసుకున్నారు. అలాంటివి ఎన్నో జరిగిపోయినవి. Joint Hindu family అనే కారణముతో వారిలో వారు ఉన్నటువంటి భూమినంతను పంపకము చేసివేసుకున్నారు. ఆ విధముగ పంపకము చేసుకొనగా, యింక మిగిలిన భూమి ఏమైనా ఉన్నదా? అంటే ఏమీ కనుపించదు. ఒకవేళ ఎక్కడైనా ఏ కొద్దో మిగిలివుంటే అందులోనుంచి కూడ భాగము రావలసి ఉంటే, ఆ విధముగ రావలసినటువంటి భాగముతో సహా మొత్తము భూమినంతయు కలిపి ఒక్కరి పేరుతోనే సీలింగు నిర్ణయించటానికి అవకాశము ఉన్నదనే మాదిరిగా బిల్లుయొక్క రెండవక్లాజులో ఉన్నది. ఒక family లో ఉన్న మైనర్లు, మేజర్లు అందరిపేరట కలిపి ఉన్న భూమినంతయు పంపకముచేసుకున్న తరువాత, ఈ బిల్లును ఫలానా తేదీనుంచి అమలు జరుపుతున్నామని చెబితే మాత్రము ప్రయోజనము యేమిటి? ఇందులో Loopholes ఏమీ లేకుండా చూసి ఈ చట్టమును త్రికరణశుద్ధిగా ప్రభుత్వం అమలు జరపగలిగిందనే విశ్వాసము ప్రజలలో కలుగజేయగలగటానికే ఈ బిల్లు ఉపకరిస్తుందని చెప్పుకోవచ్చును. తరువాత cultivation expenses ను గురించి బిల్లులో చెప్పబడి యున్నది. మొత్తము పంటలో మూడవవంతు అయితే సరిపోతుందని, మాగాణి భూమి అయితే

నాలుగవ వంతు కంటే మించకూడదు అని Opposition party వారు చెబుతున్నారు. కాని యిది మాత్రము యదార్థముకాదు. సీలింగు ఎంత అయినా పెట్టండి. 3,600 రూపాయలు పెట్టండి లేకపోతే ఒక వెయ్యి రూపాయలే పెట్టండి. కాని cultivation expenses అని మనము చెప్పేది మాత్రము త్రికరణశుద్ధిగానే చెప్పాలి. ఒక విధముగ ఆలోచిస్తే, అవి సగముకంటే హెచ్చుగానే అవుతాయి. మాగాణి అయితే సగముకంటే తక్కువగానే అవుతాయేమోగాని మెట్ట అయితే మాత్రము సగముకంటె ఎక్కువే అవుతాయి అని వ్యవసాయము చేసే ప్రతి రైతు కూడ అభిప్రాయపడక మానడు. ఇది గాక మరొక విషయము ఏమిటంటే మెట్ట పైర్ల విషయములో ప్రతి రైతుకూడ Nature పైననే ఆధారపడి ఉండక తప్పదు. ఒక సారికి, రెండు సార్లు విత్తనములు చల్లుకుంటూ, తెగుళ్ళు వగైరాలను ఎదుర్కొంటూ పైర్లు పెంచి, పంట యింటికి చేర్చుకోవాలి. తెగుళ్ళు పోవటానికి మందులు వగైరాలు కొనుక్కొని ఉపయోగించి పైర్లు కాపాడుకోవలసి ఉంటుంది. ఇలాటి ఖర్చులు అన్నీ లెక్కవేస్తే, మెట్ట పైర్లకు సగానికి ఎక్కువే అవుతాయి కాని, తక్కువ ఏమాత్రము కావు అనే విషయము గుర్తించాలి. ఇది మాత్రము exaggeration గా తలంచరాదు. అని చెబుతూ యింతటితో విరమిస్తున్నాను.

*Sri Gopal Rao Ekbote (High Court)*:—Mr. Speaker Sir, the Bill which we are considering to-day postulates the social and economic transformation in the rural society and as it is inevitably linked with serious political implications, it is but natural, that this important Bill should evoke cautious and critical analysis at the hands of the hon. Members. When we talk of Land Reforms, the Land Reforms are immediately connected with certain definite objectives which we laid down in our Constitution and also reiterated it in the First and Second Five Year Plans. As the aims and objectives of the Bill have been indicated in the very first line, that undue concentration of land in the hands of a few is not desirable in the interests of Society, it is said that this Bill seeks to remove that kind of concentration. We can therefore take the following points as the immediate objective of the Bill.

The disparity now existing in the holdings has to be removed. Distribute the land to the peasant proprietors and settle those landless labourers who have been tilling the land without owning them since many years.

This immediate objective has necessarily to be kept in view side by side with the increase in the food and other agricultural production. This Land Reforms are usually subject to diverse

policies and will have to be considered together. Any piece-meal consideration of this aspect of the Land Reform or that is bound to seriously affect the other aspects of the Land Reforms From my point of view, the following six principles have to be kept in view when we consider Land Reforms in any particular State.

The first and foremost principle which we as legislators have got to keep in view is that the ownership and cultivation should not be allowed to be diversed and every step must be taken to see that the land should belong to those who till them In other words, the absentee landlordism or the intermediary feudals who have been owning the lands without tilling them, enjoying the usufruct should be eliminated or abolished as far as it is possible.

The second task and fundamental principle which I put forward with seriousness is the intermediary and feudal interests between the tiller and the Government should be eliminated; and the third to which alone this Bill claims to refer is the fixation of the maximum limit and the size of the holding. It does not refer to the minimum size of the holding. It also does not refer to the various adjustments which naturally come when we fix either the maximum or the minimum size of the agricultural holding.

The fourth is that we must unequivocally declare our intention to establish family farms and co-operative societies. We will have to examine this Bill in the light of this, viz., whether we wish to encourage the family farms and the co-operative societies or not.

The fifth is the extensive or intensive cultivation in this agricultural holding and the increase in the production from the land.

The last and the most important is the levelling up of inequalities in land-ownership and assuring or ensuring the minimum standard of living which our Society expects for the people who reside in the rural area.

In view of these six very fundamental and basic approaches to the question of land reform, I must say, at the outset, that this Bill has not taken into consideration all the aspects of the Land Reforms. At the best, it could be said that it covers only two points. One is the fixation of maximum agricultural land

holding for the first time in Andhra area—because Telangana has already had the fixation of maximum holding—and the other is as far as Telangana area is concerned all the protected tenants to whom Sections 38-E or 53-C have not been made applicable, are also declared as owners of the land with the payment of compensation mentioned in the Hyderabad Tenancy Act. These are the two items which are dealt with in this Bill. I would, therefore, confine myself to these points which are enumerated in this Bill.

Before this Bill of fixation of maximum holding was brought before the House, in my respectful view, the Government ought to have taken some steps in order to stop the deterioration of the agricultural economy which is going on in the rural parts. The first step which ought to have been taken is to stop evictions of tenants which are going on on a very large-scale. As has been very rightly pointed out by one of my learned friends just now, the Ordinance which was issued last year with a view to collect census has naturally affected the rural parts, in that large-scale transfers of property, partitions and evictions of the tenants have taken place. In this Bill also there is no indication as to whether the Government wants to stop immediately these large-scale transfers. Even now I am sceptical about getting an inch of land, because we have given such a long time and a long convenience to make transfers of holdings between the members of families or even to strangers. The result is, as I said, that we would not be in a position to get an inch of land. The Bill only says that from the date notified hereafter, all kinds of transfers will be stopped. I would, therefore, request the hon. Members of the Select Committee to consider this important aspect and immediately put a ban on transfers which, even today, according to my information, are going on in our State.

The second point which ought to have been considered before this Bill was brought here, was the security of tenure. I know there is not a Tenancy Act as such in Andhra area. As far as Telangana area is concerned, both the problems of security of tenure and fixation of fair rent have been tackled. As far as fair rent fixed in Andhra is concerned, it requires a re-thinking. I think a considerable reduction in the area also is required.

As I said, these three steps are absolutely necessary before we think of any question in reforming the agricultural economy.

Unfortunately, the Bill does not discuss any thing with regard to this. I am definitely of the view that as long as all the aspects of the Land Reforms are not brought before the House, it is very difficult to feel or even know as to what policy the Government has with regard to the land-lord and tenant relationship, in Andhra area, with regard to the fixation of fair rent in Andhra area, with regard to giving a security of tenure in Andhra area. What is the policy of the Government with regard to the consolidation of the two legislative measures in vogue both in Andhra and Telangana areas? All these problems are left to the mysterious future which is very difficult to dwelve into. Unless that kind of picture is completely before the House, it will be very hazardous to give any final opinion regarding the fixation of the ceilings. My view, therefore, is that even if we proceed with the Bill and fix the maximum ceilings, it will have very serious repurcussions not only on the Telangana area but also on the Andhra area. And any subsequent steps to be taken to fix fair rent and to try and give the so-called tenants any kind of right as protected tenants or to give any rights to the owners of the land, will not only be superfluous but an eye-wash, because there will be no body to get these rights. When this Bill is brought before the House. it is necessary to simultaneously think on those lines which I have just now suggested.

You know, Sir, that as far as Telangana is concerned we have applied Sections 38-E and 53-C to Khammam district. The results may be a little disillusioning; but I am personally not surprised at them because even in Hyderabad so much of time and opportunity was given to the land-holders and landlords to oust the tenants from their legitimate possessions, that if surplus land is not made available to the Government it cannot be a matter of which one can be proud of. On the other hand, a lesson should be learnt from the Khammam district and some firm steps should be taken to arrest further deterioration on other fronts also. Therefore, these Sections 38-E and 53-C are now to be considered in the light of the Bill which is before the House. Then, I wish to bring to your notice, Sir, the conclusions which naturally follow from them because rightly or wrongly the relations between the land-lord and the tenant have been fairly settled as far as Telangana area is concerned. Sections 38-E and 53-C are not applicable to other districts of Telangana except in the case of Khammam. This increase in ceiling, therefore, is bound to raise many complications and many problems for which there is no solution suggested in the Bill. With

regard to the other parts of the Telangana area also, this particular Bill while fixing the ceiling leaves aside the question of the relationship between the land-lord and the tenant—whether protected or ordinary. It does not give any indication as to what policy the Government will adopt. So that also is likely to disturb the settled situation, and amounts not only to taking back the clock in Telangana area but also to seriously disturbing the agricultural economy in that area.

Regarding Andhra area, as I have already said, the first Ordinance was issued and this Bill is brought before the House without taking any steps to arrest the transfers or partitions or gifts. The net result is going to be this. There will be no doubt personal cultivation as far as Andhra is concerned, but the 'tenants' as a class will be completely wiped out and not an inch of land will be made available to the tenants. Sir, it is a serious aspect of the land reform. There is no use in telling us that the land has already been distributed and there is no land to be acquired and there is no surplus land to be given to those landless labour or to the tenants. If the census which was provided by the Government is correct, naturally there was a stage when, if prompt steps had been taken, we could have certainly got the surplus land. And even now it is not too late. Let us at least be very clear in our minds that we are very serious as far as agricultural economy is concerned and we do not want to maintain the disparity in the levels of rural and urban economy. If that vision is kept clear and steps are directed towards that end, I am quite confident that even this hour is not a late hour and we can arrest further deterioration.

Now, sir, the second point which I wish to bring to the notice of the House is with regard to the present holding and the future holding. The various disparities are quite obvious on the face of the Bill. I wish to request the hon. Members who would go into the Select Committee to see particularly that these disparities are removed on the right direction. The erstwhile Hyderabad State had fixed Rs. 3,600 as the ceiling both for the present as well as the future holdings. Section 38-E of the Hyderabad Act had also conferred ownership on the protected tenants. As far as Khammam is concerned compensation of 60 to 75 times the land revenue payable in eight years has also been fixed. Now, if this Rs. 3,600 maximum holding—present as well as future and the compensation which the protected tenant would be required to pay after he becomes the owner on the lines of Khammam district are kept in view and compared

with the present Bill, I am sorry to say that there is no improvement on the Bill which we already have in the Telangana region. The Planning Commission had already suggested in their Second Five Year Plan that it should be fixed in terms of family holdings and they have suggested that in terms of net income it should not exceed Rs. 3,600 annually. Now, this Bill

(The Bell was rung)

*Mr. Speaker*:—Time is over, but I am extending five minutes to enable you to complete the speech.

*Sri Gopal Rao Ekbote*:—I am not completing, Sir.

*Mr. Speaker*:—You have to. I will give you five minutes more.

*Sri Gopal Rao Ekbote*:—I might bring to your notice, sir, that the hon. Deputy Speaker had agreed to give me about 25 minutes. Now, I have been speaking only for 10 minutes

*Mr. Speaker*:—You have spoken for 15 minutes.

*Sri Gopal Rao Ekbote*:—All right, 10 minutes more, Sir.

*Sri A. C. Subba Reddi*:—A point of information, Sir. Is the time fixed according to the individual members in the Assembly or equally to all?

*Mr. Speaker*:—The Speaker can give time to each hon. Member according to his discretion. That is the Rule. There is nothing against it.

*Sri A. C. Subba Reddi* (Nellore):—A point of information, Sir. Is the time fixed according to the individual members in the Assembly or equally to all?

*Mr. Speaker*:—It may be 'influence', or if the Speaker thinks that much more useful information will be obtained from learned hon. Members he may allow more time to such hon. Members. The only influence is his learning and his usefulness.

*Sri Gopal Rao Ekbote*:—I think this time will not be counted in my time, Sir.

What I was referring to was the fixation of the net income at Rs. 5,400. May I bring to the notice of the House that, in fact,

if it is read along with the other provision which permits one-third of the maximum permissible holding for grazing purposes, if that land is exclusively used for grazing, then it comes to about Rs. 7,200. So, if that particular clause is not tightened properly, it is likely to be used in favour of the land-lord and will be taken advantage of by every land-lord. Thus, the ceiling will not be Rs. 5,400 but Rs. 7,200 as far as the net income is concerned. Added to it if we take into consideration the clause pertaining to joint family, as far as *per sterpis* is concerned, I have nothing to say; but as far as *per capita* is concerned, if the members of the joint family exceed the number of five and every additional member is given Rs. 1,200 as the net income, then there would be no limit. So, as far as fixation of the limit is concerned.............. .........

(The Bell was rung)

You said, sir, just now... ..

*Mr. Speaker*:—That is all, you have to finish in two or three minutes.

*Sri Gopal Rao Ekbote*:—Then, I think I should not proceed.

*Mr. Speaker*:—All right. There is no threatening allowed.

The Speaker will allow any body to sit, if he chooses to sit down.

*Sri Gopal Rao Ekbote*:—There is no question of threatening, Sir. When you yourself had agreed that I should speak for 10 more minutes and in the next moment if you ring the bell, I have no other alternative than to sit.

*Mr. Speaker*:—I never said that I will allow 10 minutes.

*Sri Gopal Rao Ekbote*:—You have said that I have spoken for 15 minutes and that I would be allowed to speak for 10 minutes more.

*Sri Pillalamarri Venkateswarlu (Nandigama)*:—The hon. Member may continue tomorrow as well, Sir.

*Mr. Speaker*:—Your recommendation is unnecessary.

*Sri Gopal Rao Ekbote*:—Sir, I am....................

*Mr. Speaker*:—No, if you sit down like that, I cannot accept your threats. I would have given you two or three minutes more had you merely requested me. Because you said you would not proceed and because you sat down, I have asked you to sit. So, please sit down and I do not allow any thing now. Otherwise, what is the meaning of threatening me like that?

We shall now adjourn till 8-30 a.m., tomorrow.

(*The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the 19th August 1958*)